# గాంధీమహాత్ముడు {రెండవ భాగము}

దేశోద్ధారక గ్రంథమాల ప్రచురణము ౧౦



భాద్రపదము వెల ఆరు అణాలు



గ్రంథకర్త: "విష్ణుచక్రం"

# గ్రంథమహాత్ముడు

(రెండవభాగము)




"ఆంధ్రుడ నాంధ్రు డంచనినయంతనె యాంధ్రుడవౌదువొక్కొ నీ
షాంధ్రమునందు నొక్కక్షణ మైనను బల్కగలావె హూణభా
[illegible]ంధ్రముతోడ విశ్రణమునల్పక; దుఃఖకరమ్ముగాదె; నీ
యాంధ్రిసరస్వతీ యశమహర్నిశమున్ వెలుగొందజేయుమీ."

శ్రీ. భాగవతుల నరసింహమూర్తిగారు.
(భారతినుండి)

స్థాపితము-౧౮౬౦. శా. శ.

గ్రంథకర్త:—

"విష్ణు చక్రం"

# విషయసూచిక.

(రెండవభాగము)

# దేశోద్ధారక గ్రంథమాల

## —ఆశయములు—

ఈ గ్రంథమాల కీర్తిశేషులైన విశ్వదాత, దేశోద్ధారక, కళాప్రపూర్ణ కాశీనాథుని నాగేశ్వరరావుగారి స్మారక చిహ్నముగ స్థాపితమైనది.

ఆంధ్రముతప్ప వేరుభాష ఎరుగని ఆంధ్రసోదరులలో ప్రపంచ జ్ఞానము కలిగించుటకును, ఆంధ్రసోదరులకు మాతృభాషలో అవసర గ్రంథములను అందుబాటులోనుంచి మాతృభాషాభిమానము కలిగించుటకును సేవచేయుటయే ఈ గ్రంథమాల ముఖ్య ఆశయము. ఈ గ్రంథమాలద్వారా ప్రాచీన, ఆధునిక, వాఙ్మయ, రాజకీయ, వైజ్ఞానిక, సాంఘిక విషయములకు సంబంధించిన గ్రంథములు సంవత్సరమునకు నాలుగు (మొత్తముపై ౮౦౦ ల పుటలకు తక్కువ కాకుండ) ప్రచురింపబడుచుండును.

అనుబంధ ప్రచురణములుగా రైతు, వర్తక సోదరులకు సంబంధించినవి ఆంధ్రీకరించి ప్రచురింపబడును.

## —నియమములు—

ఈ గ్రంథమాలద్వారా ప్రచురింపబడు గ్రంథములను కొనుటకు లిఖితపూర్వకముగా నొప్పుకొనువారు గ్రంథమాల సభ్యులుగా ఎంచబడుదురు. అట్టి సభ్యులు ప్రథమమున నాలుగు అణాలు ప్రవేశరుసుముక్రిందను, రూపాయ ఎనిమిదణాలు వార్షికమూల్యము క్రిందను యివ్వవలయును.

సంవత్సర మధ్యకాలములో ఎప్పుడు సభ్యులుగా చేరినను వారు సంవత్సరారంభమునుండి సభ్యులుగా నున్నటులే ఎంచబడుదురు. తిరిగి (తెలుగు) సంవత్సరారంభమున మొదటి ప్రచురణము వార్షిక మూల్యముతో వి. పి. చేయబడును. అట్టి వి. పి. తిరుగకొట్టబడినచో వారి సభ్యత్వము వి. పి. వ్యయముక్రింద చెల్లుబెట్టుకొనబడును గాన వారు సభ్యత్వమును కోలుపోయినవారగుదురు. తిరిగి సభ్యత్వమును గోరినయెడల లోగాఅయిన తపాలావ్యయము చెల్లించవలసియుండును.

అనుబంధ ప్రచురణములు సభ్యులు కొనవలయుననునిర్బంధము లేదు. ఎల్లరకు ఒకేధరకు విక్రయింపబడును.

వట్టికోట ఆళ్వారుస్వామి,
స్థాపకుడు, ప్రకాశకుడు
దేశోద్ధారక గ్రంథమాల,
సికింద్రాబాదు.

---

# దేశోద్ధారక గ్రంథమాల.

## సభ్యుల ప్రవేశ పత్రము

ప్రకాశకులు గారికి

నేను మీ గ్రంథమాల నియమములను, ఆశయములను తెలిసికొనినాను. నేను సభ్యునిగా చేరుటకు అంగీకరించుచు, ప్రవేశ రుసుముక్రింద నాలుగు అణాలు, వార్షికమూల్యముక్రింద రూపాయ ఎనిమిదణాలు * తపాలాద్వారా పంపించుచున్నాను, వి. పి. ద్వారా రాబట్టుకొనుటకు కోరుచున్నాను.

సంతకము

పేరు

నివాసగ్రామము.

తపాలా కార్యాలయము.

తాలూకా.

జిల్లా.

రసీదు సంఖ్య. తేది.

---

* తా మేవిధాన మవలంబించెదరో దానినిమాత్రముంచి రెండవది కొట్టివేయవలెను.

# గాంధీ మహాత్ముడు.

## మొదటి ప్రకరణము.

### హరిజనోద్యమము.

హరిజనోద్ధరణోద్యమము మహాత్మునికిఁ బ్రాణ సమానము. భారతదేశమందు మొత్తము జనాభాలో 3 కోట్లకు పైగా హరిజనులున్నారు. వారిని మనము క్రిస్టియనులనము, మహమ్మదీయులనము. అట్లా యెవరైనా అంటే పై పెచ్చు మనము రోషపడతాము. హిందువులేఅని చెప్పడానికి మనసొప్పదు, నోరురాదు. ఇక వారెవరు ? నిష్కల్మషహృదయములతో వారు హిందువులే యని మనము బహిరంగపఱుపకపోయినా, తక్కిన జాతుల వారు హిందువుల క్రిందనే లెక్కిస్తారు. కాదని పీకులాడుతాము మనము. న్యాయమాలోచిస్తే వారు ముమ్మాటికి హిందువులే. కాని వారి వృత్తులనుబట్టి, అశుచినిబట్టి మనము వారిని దగ్గఱకు రానియ్యము.

మహాత్ముని హరిజనోద్ధరణ ప్రయత్నమునందు రాజకీయముగా, సాంఘికముగా గూఢార్థము స్ఫురించును. ఆయనకు గల దూరదృష్టిని మనము గ్రహించలేక పోతున్నాము. మనకు, హరిజనులకు గల తారతమ్యమును గ్రహించి ప్రభుత్వమువారు జనాభా లెక్కలలో సవర్ణ

హిందువు లెంతమంది, మహమ్మదీయు లెంతమంది, క్రైస్తవు లెంతమంది, హరిజనులెంతమందియని విడివిడిగా తేల్చినారు. సవర్ణహిందువు లెక్కువమందిగలరు. కనుక వారికి అధికసంఖ్య హక్కు దొరకినది. మిగతావారు అల్పసంఖ్య వర్గములకు సంబంధించినారు. దానితో సవర్ణులకు, హరిజనులకు భేద మేర్పడినది. అదొక సాకుగాగొని, క్రిస్టియనులు, మహమ్మ దీయులు వారిని తమ మతములలోనికి మార్చుకొనం బ్రారం భించినారు. ఈపనికి మొదట క్రిస్టియనులు పూనుకొనినారు. చాల మందిని లేనిపోని ఆశలు కల్పించి తమ మతములో కలుపుకొనినారు. తరువాత అదేరకంగా మహమ్మదీయులు సాగించినారు. ఈవిధంగాజరిగితే కొంతకాలానికి హరిజనుల తెగ మాయమైపోతుంది. ముఖ్యముగ మిగిలేవి మూడు జాతులు.

మేము హిందువులమేయని బహిరంగముగా-నెన్నియవ మానములు, కష్టములువచ్చినా సహించుకొని - హరిజనులు ఘోష పెట్టుతుంటే కాదని మనము నిరాకరించుచున్నాము. ఇంతకన్న అన్యాయముంటుందా ? నేడన్నివిధములైన మార్పులుకలిగి, పునర్నిర్మాణమునకు సిద్ధముగానున్న సంఘ శాసనముల ప్రకారము వారస్పృశ్యులే యగుదురుగాక ! బహిష్కృతులే యగుదురు గాక!! సమయానుకూలముగా మనము ప్రవర్తించకపోయిన న్యూనతగా నుండదా? వారెట్లు బహిష్కృతులైరి ? విచారింతము.

### బహిష్కృతులెవరు ?

ప్రథమమున--బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులను-

నాల్గు తెగలుగా భారతీయులు విభజింపబడి, వారివారి విధులను నియమింపబడినవి. ఇది పూర్వ మెప్పుడెన్ని వేలేండ్ల క్రితమో జరిగినది. ఈ నాగులు తెగలవారు విధింపబడిన నియమములను పాటింపకుండ నుందురేమోయని, ఆధ్యాత్మిక చింతన వదలి దుర్మార్గప్రవర్తకులు కాగలరేమోయని, మన పూర్వులు వర్ణాంతర వివాహములు జరుపుకొనుట కనుజ్ఞ నొసంగలేదు. ఏ వర్ణములోనివారావర్ణములోని వారితోనే వివాహమొనర్చుకొనవలెననిరి. దీనికి కారణము లేకపోలేదు. వారి కర్మలు స్వభావజన్యములగు గుణములచే విభజింపబడినవి.

"బ్రాహ్మణ క్షత్రియ విశాం । శూద్రాణాం చ పరంతప,
కర్మాణి ప్రవిభక్తాని । స్వభావ ప్రభవైర్గుణైః॥

(అ-౧౮-శ్లో-౪౧ భగవద్గీత)

(ఓ పరంతపా! బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రుల కర్మలు సయితము వారి స్వభావజన్యములగు గుణములచే విభజింపబడినవి.)

ఐతే అవి పరస్పర సహకారమొనర్చుకొనుటకు వీలుగా నేయున్నవి. అందరూ ఆధ్యాత్మిక చింతనతో ప్రొద్దు బుచ్చితే, దేశసంరక్షణ, పాలనము జరుగదని వాటికొఱకు క్షత్రియులను, వ్యాపారము జరుగకపోయిన దేశము సుభిక్షముగానుండదని దానికొఱకు వైశ్యులను, సేద్యమొనర్చుటకు శూద్రులను నియమించినారు. ఇందులో ఎక్కువ తక్కువలు లేకుండా అన్ని వర్ణములు సమానమే. ఐనా విధింపబడిన

నియమములందు భేదమున్నందున నాయానియమముల ననుస రించువారిని వరుసగా బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రులని పేర్లుపెట్టినారు. దీనివలన నన్నిటికన్న నాధ్యాత్మిక సంపద గలవారికే ప్రాధాన్యత నొసగబడినది. ధర్మచింతన గలిగి, ఆధ్యాత్మిక విజ్ఞానమితఱులకు బోధింపవలసిన బ్రాహ్మణులు తక్కిన వారితో వివాహ మొనర్చుకొనినఁ బొసఁగునా? వంశానుగతముగ నభిప్రాయములు ప్రతివర్ణమువారికి వచ్చు చుండును కనుక వీలుండదు. నియమభంగము కలుగఁగూడ దని విధించుతూ బ్రాహ్మణస్త్రీలు తక్కిన మూడువర్ణముల వారితోగాని, క్షత్రియ స్త్రీ మిగతా రెండువర్ణముల వారితో గాని, వైశ్య స్త్రీ శూద్రులతోగాని, శూద్రుడు పై వర్ణ స్త్రీలతోగాని సంపర్క మొనర్పరాదని శాసించినారు. అట్లా సంపర్క మొనర్చిన స్త్రీలను, కులమునుండి బహిష్కరింప వలెననినారు. అట్టి స్త్రీలకుఁ బుట్టిన సంతానమునుకూడ వెలి వేయవలెననినారు. ఇంతకఠినముగ శాసింపఁబడినను, వ్యభి చారదోష మడుగంటలేదు. దాని నొనర్చినవారిని, వారి సంతానమును బహిష్కరించినారు. సంఘసభ్యులు వారి నస్పృశ్యులుగా పరిగణించినారు. సంఘములో వారికే హక్కు, గౌరవములు లేవు. సంఘబహిష్కారమునకు వెఱచి, సవర్ణులు వారిని దగ్గఱకు రానీయకుండా అంటరానివారుగా నిర్ణయించి నారు. ఇది అసలు రహస్యము.

నేడు సంఘమర్యాద లతిక్రమింపబడినవి. నియమ విధానము రూపుమాసిపోయినది. గీచినగీటు చెరిగిపోయినది. అన్ని వర్ణములవారికి—ఏకొద్దిమందికో తప్ప! (వీరిలో కూడ

చాలామంది నలుగురు నమ్ములాగున లేసిపోని యాడంబర
మొనర్చువారుగలరు)—పరిహాసాస్పదమైనది. ఇంత తారు
మారయినా, పూర్వపు సవర్ణులు నేడుకూడ సవర్ణులే పరిగ
ణింపఁబడుతున్నారు. అస్పృశ్యు లిప్పటికీ అస్పృశ్యులే!—
బహిష్కృతులే!! ఆ సంఘనియమ తిరస్కారమొనర్చినవా
రెన్ని వేలేండ్లక్రిందనో నశించినారు. వారి సంతతి నేడు
మిగిలినది. పూర్వుల తప్పి దానికి వీరనుభవిస్తున్నారు.
సవర్ణులు నేడు పేరుకే. వారిలో తొంబదితొమ్మిదిపాళ్ల
క్రమవర్తనులుగలరు. నియమభంగకారకులు గలరు. వీరెట్లా
సవర్ణులో చెప్పుటకు వీలుకాకుండాఉన్నది. పూర్వపు కట్టు
బాట్లలోఉంటే అది వేలుసంగతి. కాని వీరు, బహిష్కృతు
* లొకే తెప్పమీద ప్రయాణము చేస్తూన్నప్పుడు నైతికంగా
ఏమిభేదముంది?

ముఖ్యంగా ఆత్మసంయముకలిగి, నిజానిజము లాలో
చించుకొని, ప్రవర్తించుతే అంతా సమానముగానే, ఈశ్వరుని
సంకల్పముగానే గోచరించును. శ్రీకృష్ణుఁడేమనినాఁడు?

"విద్యావినయసంపన్నే । బ్రాహ్మణేగవిహస్తిని
శునిచైవశ్వపాకేచ । పండితాస్సమదర్శినః"

(అ-౫-శ్లో-౧౮-భగవద్గీత)

(జ్ఞానులు విద్వాంసుని, వినయసంపన్నుఁడగు బ్రాహ్మ
ణుని, గోవును, ఏనుఁగును, కుక్కను, చండాలుని సమాన
ముగా జూచుచుందురు.)

---

* ("Sailing in the same boat"

మహాత్ము డిట్లు వ్యాఖ్యాన మొనర్చినాఁడు:—

"వారి యావశ్యకత ననుసరించి యెల్లరికి సేవచేయు చుండును. బ్రాహ్మణునియెడను, చండాలునిపట్లను సమభావమును కలిగియుండుట కర్థమేమనఁగా బ్రాహ్మణుని పాము కఱచినప్పుడు వాని గాయము నెట్లు జ్ఞాని ప్రేమభావముచేఁ బీల్చి దానివిషమును దొలఁగింప యత్నించునో, అట్టి యాచరణమునే చండాలునిఁ బాము కఱచినప్పుడు చూపించును." (నిష్కామయోగము)

సమత్వబుద్ధి ప్రతివానికి ఉండుట కష్టమే. బుద్ధిబలమున నాలోచించుకొనుట ప్రతివానికిఁ జేతగాకపోవచ్చును. కాని సమబుద్ధిఃగలవారెవ్వరైన మేలు జేకూర్పదఁలచి బోధించిన విని, దాని నాచరణలోనుంచుట కేమి? శ్రీరామానుజులు గోష్టిపురములో అష్టాక్షరీమంత్రమును బహిరంగముగా నుపదేశించినదెవరికి? తనగురువు పరమ మంత్రరాజపఠనము నితరులెవ్వరైన వినిన పాపమువచ్చునని బెదిరించినప్పుడేమనిజవాబొసగినాఁడు? * గురుదేవా! నరకబాధలవలన నాకేలాటి భయములేదు. ఈ మంత్రరహస్యము ప్రబలాంధకారముననున్న వారిని రక్షించునని తెలిసినప్పుడు దానిని బహిరంగపఱచుటకు నా శరీరాత్మలను సైతమర్పణగావింతును. (శ్రీమాన్ జి. రమాకాంతాచార్యులవారి "సత్యమనే దేవాలయము"నుండి.

---

*"..... Hell-fire hath no fears for me,
Master! It may, my body and soul consume.
I lay them down in joy when I do see
The secret saved man from eternal gloom."
(From "In the temple of Truth")
by G. Ramakantacharya, B. A.

ఆయన బోధించిన శ్రీసూక్తులను మనము శిరసావహించుటలేదా? అట్లనే మహాత్ముని ప్రబోధ మేలశిరసావహించకూడదు? అనినాప్రశ్న.

౨. ప్రాయోపవేశదీక్ష.

సవర్ణులమీద మహాత్మునికేమైన యీర్ష్య ఉండి చెప్పినాడని యనుకొనవచ్చును. కాని ఇంగ్లండులోనే పాశ్చాత్యులయెదుటనే తన నిశ్చయమును వక్కాణించినాడే! తొలుత సవర్ణులకు విజ్ఞప్తి గావించినాడు. కాని వారు పెడచెవినిబెట్టి, మతవిషయములో జోక్యము కలిగించుకొనఁబడిన వర్ణసంకరము ప్రాప్తించుననని భయపడి, అదే తెగకు (అస్పృశ్యులకు) సంబంధించిన ప్రభుత్వమువారితో మొఱపెట్టుకొనినారు. రాజకీయ తంత్రనైపుణ్యమున ప్రభుత్వమువారడిగినదే తడవుగా హరిజనులను ప్రత్యేక తెగగా నిర్ణయించినారు. వారికేమి? ఎన్నిరకాల మతసంఘర్షణలు జరుగుతే వారికంతలాభము. సవర్ణులకు గావించుకొనిన విజ్ఞప్తి అరణ్యరోదనమై ప్రభుత్వమువా రస్పృశ్యులను ప్రత్యేక తెగగా నిర్ణయించినప్పుడు మహాత్మునికి గొప్ప అన్యాయము జరిగినట్లు విశదమైనది. తానూ ప్రభుత్వమువారికే విజ్ఞప్తి జేసినాడు. లాభము లేకపోయినది. అసమాన దివ్యాస్త్రమునుపయోగించినాఁడు.

తొలుత ౧౯౩౧ లో * గుండ్రబల్ల సమావేశ సందర్భములో హరిజనుల విషయమై మహాగంభీరముగానుపన్యసించినాడు. తరువాత ౧౯౩౨ మార్చిలో ఇండియా

* Round Table Conference.

కార్యదర్శికి జాబువ్రాసినాడు. కాని వృథాగాపరిణమించినది. ౧౧-౩-౩౨ నాడు ఇండియా కార్యదర్శికి వ్రాసిన ఉత్తరములోను, ౧౮-౮-౩౨ లో బ్రిటిషుప్రభుత్వ ప్రధానామాత్యునికి వ్రాసిన ఉత్తరములోను, ఆ జన్మాంత ముపవసించెదనని ప్రతిజ్ఞనొనర్చినాడు. పరిస్థితులువిషమించుటవలన, తగిన సమాధానము కుదురనందున, ౨౦-౯-౩౨ నాడు మధ్యాహ్న సమయమునం దుపవాసమునారంభించెను. ఆ సమయమున భారతదేశమునందు, తక్కినప్రదేశములందు కలిగిన సంచలనము వర్ణనాతీతము. మహాత్ముని జీవితమెంత విలువగలిగినదో ప్రపంచమునకు విశదమైనది. ప్రభుత్వమువారు మేల్కొని నారు. మహాత్ము డుపవాసమును విరమించినాడు. పరదేశస్థులైన అంగీకరించినారుకాని, సనాతన ఛాందసచక్రవర్తులు మాత్రము మారలేదు. అబ్బా! + "సుస్థిరులు" అంటే వీరే!! ముమ్మాటికి వీరే!!!.

అస్పృశ్యులంటే శ్రోత్రికటువుగా నుండునని "హరిజనులు"అను పేరిడినాడు. ఎంతముద్దుపేరు! మానవులందఱు హరిజనులుగాక మఱెవరు? ఒప్పుకొనినా, నిరాకరించినా ఒక్కపేరుతోనే అస్పృశ్యులని పిలువఁబడిన యమాయకులను సవర్ణులతో సమానమొనర్చినాడు. మానవ జాతిమీద మహాత్మునికి, సవర్ణ సనాతనులకు గల ప్రేమలో నెంత వ్యత్యాసమున్నది దీన దెలియుటలేదా ?

### 3. రౌండుటేబిలు సమావేశము-హరిజనసమస్య.

రౌండుటేబిలు రెండవ సమావేశమునందు మైనారిటీ

---

+ "No—changers"

కమిటీలో ౧౩-౧౧-౧౯౩౧ నాడు ఇంగ్లాండులో మహాత్ము డేమని వాదించినాడు ?

* " ఇతర జాతుల పక్షమున గావింపబడిన హక్కులు నాకర్థమైనవి. కాని అస్పృశ్యుల పక్షమున నెజేగింపబడిన హక్కులు మాత్రము నాకు చాల బాధనుఁ గలిగించునవిగా యున్నవి. అవి క్రూరమైన రాజకీయ ప్రతిబంధకములుగా నున్నవి. అస్పృశ్యులను బ్రత్యేక తెగగా పరిగణించుటకు మేమంగీకరింపము. శాశ్వతముగా శిక్కులు ప్రత్యేక తెగగా నుండవచ్చును. అటులనే మహమ్మదీయులును, క్రైస్తవులును. అస్పృశ్యులు శాశ్వతముగ నస్పృశ్యులుగానే యుందురా? అస్పృశ్యత గలిగియుండుటకన్న హిందూమతమే నశించుట నాకభిమతము. అస్పృశ్యుల హక్కుల నెజేఁగించువారు

---

* "I can understand the claims advanced on behalf of other communities, but the claims advanced on behalf of the 'untouchables' are to me the unkindest cut of all. It means a perpetual bar sinister. We do not want the 'untouchables' to be classified as a separate class. Sikhs may remain such *in perpetuity*, so may Muslims and Christians. Will the 'untouchables' remain untouchables in perpetuity? I would far rather wish that Hinduism died than that untouchables lived. Those who speak of the political rights of untouchables do not know India and do not know how Indian society is constituted. Therefore, I want to say with all the emphasis I can command that if I was the only person to resist this thing, I will resist it with my life............................"

౨

హిందూదేశమునుగాని, అందలి సంఘనియమములనుగాని యెఱుగరు. కనుక అస్పృశ్యతను ప్రతిఘటించుటకు నొక్కడనేయైనచో, జీవితమును సైతము ధారపోసి ప్రతిఘటింతునని నొక్కి వక్కాణించెదను."

ఉపవాసానంతర మిట్లభిప్రాయ మొసగినాడు:—

‡ "హిందూమతస్థుల హృదయములందు పరివర్తనమును కలుగునట్లొనర్చి, వారిని సక్రమ మతావలంబకుల నొనర్చుటకొఱకే ఉపవాసము తలపెట్టబడినది."

దీనివలన నాయన సలిపిన ఉపవాసము దేనికొఱకో విశదమగుచున్నది.

## ౪. బహిరంగసభ—తీర్మానము.

తరువాత (మహాత్ముఁ డుపవాసదీక్ష గైకొనిన కొద్ది రోజులకు) పండిత మదనమోహన మాలవ్యాగారి యాధిపత్యమున బొంబాయిలో ౨౫-౯-౩౨ నాడు జఱిగిన సమావేశమునందు ఈ క్రింది తీర్మాన మేకగ్రీవముగ నామోదింపబడినది. ఈ తీర్మానము మహాత్ముఁ డుపవసించుదినము, లలో భారతదేశమునందు కలిగిన సంచలనమును గుఱ్ఱెఱిగి ప్రతిపాదింపబడి, యామోదింపఁబడినది.

* "ఇకనుండి పుట్టుకతో ఎవరుగాని హిందువులలోన నస్పృశ్యులుగా పరిగణింప బడుకుండుటకు, ఇంతకుముం

---

‡ "Fast is intended to sting the Hindu conscience into right religious action".

* "The Conference resolves that, hereafter, amongst Hindus no one shall be regarded as an untouchable by reason of his birth and that those who

డావిధముగా తలపఁబడుచున్న వారికి తక్కిన హిందువులకు వలెనే బావులు, పాఠశాలలు, వీధులు మొదలగువా టన్నిటి మీఁద సమాన హక్కులు గలవనియు సభవారిచే తీర్మా నింపబడినది. సాధ్యమైనంతవఱ కీహక్కును ప్రప్రధమమున శాసన పూర్వకముగా నెఱింగింపవలెను. మఱియు స్వరాజ్య పార్లమెంటులో, అంతవఱ కెఱిగింపబడని సందర్భమున మొట్టమొదటి శాసనముగా అంగీకరింపఁబడును.

మఱియు న్యాయశాంతియుత పద్ధతుల నవలంబించి, ఆచారముగా అస్పృశ్యులని పిలువఁబడుచున్నవా రనుభవిం చెడి సాంఘిక నిరోధములను, దేవాలయ ప్రవేశానర్హతను దొలగించుట కందఱు హిందూనాయకులు ప్రయత్నించు టకుకూడ అంగీకరింపబడినది. ”

ఈ తీర్మానములోని హంశములను బరిశీలించిన హరిజనులకు నిత్యజీవితములోన నెన్ని యంతరాయములు

---

have been so regarded hitherto will have the same right as other Hindus in regard to the use of public wells, public schools, public roads and all other public institutions. This right shall have statutory recognition at the first opportunity and shall be one of the earliest acts of the Swaraj Parliament, if it shall not have received such recognition before that time.

It is further agreed that it shall be the duty of all Hindu leaders to secure, by every legitimate and peaceful means, an early removal of all social disabilities now imposed by custom upon the so-called untouchable classes, including the bar in respect of admission to temples."

కలుగుచున్నవో తెలియగలదు. సాంఘికముగా నెవరికి నేదేశములో లేని దుర్భర కష్టముల ననుభవించుచున్న వారిని ఉద్ధరించినవాఁడు మహాత్మ్ముఁడొక్కఁడే! ఆయనకీర్తి యాచంద్ర తారార్కముగ నిలువగలదు. ఆయనపేరు సువర్ణాక్షరములలో భారతదేశ చరిత్రయందు భావి చరిత్రకారులచే వ్రాయబడును. దశావతార పురుషులతో బాటు ఆయనను భవిష్యత్కాలపు భారతీయులు పూజించెదరు. ఇందావంతయు సందియములేదు.

౫. రాజకీయములు-హరిజనసమస్య.

కొందఱు మేధావులు, రాజకీయ విషయములందు హరిజనోద్యమమును ప్రారంభించినందుకు మహాత్ముని విమర్శించిరి. దాన మహాత్ముని హృదయతత్వము నెఱుగజాలరని తెలియుచున్నది. ఆయన కేవలము రాజకీయవిషమ పరిస్థితులందు దేశము నుద్ధరించు నాయకుడు మాత్రమే కాకుండ, మతప్రవక్తయనియు మన మెఱుగవలెను. మత ప్రసక్తి లేక, ఆధ్యాత్మిక వికాసములేక, శుష్క రాజకీయములందే జీవితమునంతను గడపు మహానాయకు లెందఱు ప్రపంచము నందు జన్మించలేదు? ముమ్మాటికి వారు శాశ్వత కీర్తిని గాంచినవారే! కాని వారికి సర్వ సమగ్ర విజ్ఞానములేదు. దేశసంరక్షణ కార్యములు మినహా, వారొనర్చిన దేదియు లేదు. అవతార పురుషులవలె వారు చిరస్మరణీయులు కాజాలరు. మహాత్ముఁ డట్లుకాదు. ఆయనకీర్తి ఆచంద్రార్కముగ నిలుచును. ప్రపంచజాతుల నుద్ధరించిన మహాపురుషుఁడని

ప్రతి మానవుడు ప్రశంసించెను. ఏజాతికి సంబంధించినవారైనను, భారతీయులుగ బరిగణింపబడు వారినందఱిని దాస్యభారమునుండి తొలగింప ప్రయత్నించుచున్నను, క్రూరముగ, అన్యాయముగ తోడిమానవుల దృష్టిలో అంటరానివారుగా బహిష్కరింపబడిన హరిజనుల కష్టములనుజూచి యూరకుండ వీలగునా? జీవితమంతయు రాజకీయములందే గడపిన చాల కాలమునుండి వచ్చుచున్న యీ దురాచారమును మాన్పుటెట్లు? ఆయనకు సవర్ణులనిగాని, అస్పృశ్యులనిగాని భేదభావములేదు. అందఱు సమానమే. మానవులందఱు దేవునిబిడ్డలే. హెచ్చుతగ్గుల తారతమ్య మా సృష్టికర్తకు గలదా? లేదు. అట్లనే అవతారపురుషులకు భేదభావముండదు. మహాత్ముఁడు భూతదయ గలవాడు. పిపీలికాది బ్రహ్మపర్యంత మాయనకు భగవానుని విభూతి యుతమై గోచరమగును. భగవద్గీతలో చెప్పబడునట్లు మహాత్ముఁడు సమభావముగల పండితుఁడు.

ఇంతేకాకుండ, హరిజనోద్యమమునందు రాజకీయ రహస్యముకూడ గలదు. ప్రస్తుతము స్వాతంత్ర్య సంపాదన ప్రయత్నమునకు మైనారిటీ సమస్య ప్రతిబంధకముగానున్నది. హిందూ మహమ్మదీయ క్రైస్తవజాతులు పరస్పర స్నేహాభివృద్ధికి బాటుపడఁగలవేకాని, జాతి మత భేదములను వదలి యొకటిగా మారుట యసంభవము. స్నేహభావము సన్నగిల్లి నేఁడు పై మూడుజాతులు మతావేశ దురభిమానమునఁ బోట్లాడుకొనుచుండుట మన మెఱిగినదే. దేశ స్వాతంత్ర్యమునకు వ్యతిరేకముగ మైనారిటీ సమస్య

పురిగొల్పబడిన విషమ సమయమునందు, హిందువులు, హరిజనులు పరస్పర భేదభావములుగలిగి వైదొలగియుండుట శ్రేయస్కరమగునా? హిందూ మతములోనికి అందులోని శాఖకు సంబంధించినవారేయగు, హరిజనులను కలుపుకొనినచో ప్రస్తుతముగల మహమ్మదీయ క్రైస్తవ మైనారిటీ సమస్యలతో బాటు హరిజన సమస్యకూడ ప్రతిబంధకముగా నుండదా? సాంఘికాచార బహిష్కృతులైనంతమాత్రమున ప్రత్యేక తెగగా హరిజనుల నుంచుటయన నాత్మీయులను మనస్పర్థలు కలిగి త్యజించుట యగును. ఏడుకోట్ల హరిజనులితర మతములలోనఁ జేర్పఁబడిన లాభమేమి? వారిని హిందూ మతములోనే చేర్చుకొనిన హిందూమతమున కెక్కుడుబలము సమకూరినట్లుకాదా? ఆ శుభసమయమే తెంచినప్పుడు మూడువిధముల మేలు చేకూరును. ౧. హరిజన సమస్య లేకుండుట. ౨. హిందూబలగ మభివృద్ధి జెందుట. ౩. అస్పృశ్యతాదోషమున సాంఘికముగ నెన్నియో యగచాట్ల ననుభవించు ఏడుకోట్లమంది మానవులు సంతోష సౌఖ్యములనందుట. మహాత్ముని యాదేశముప్రకార మీ హరిజన సమస్యను సక్రమముగా, సముఖముగా సనాతనులు కొనసాగించినచో నెంతయో బాగుండును. హిందూమతమును బోషించినవారగుదురు.

౬. హరిజన దేవాలయప్రవేశము.

ఈ మధ్య హరిజన దేవాలయ ప్రవేశ మంగీకరింపఁబడినట్లు వార్తాపత్రికలలో చదివినాము. మొదట తిరువాన్కూరు మహారాజుగారీ విషయమున మార్గదర్శకులైరి.

వారిని మహాత్ముడు, తక్కిన కాంగ్రెసునాయకులు, అభినం
దించడమే కాకుండ, తిరువాన్కూరు స్టేటులో నివసించు
చున్న వేలమంది హరిజనులు హృదయపూర్వకముగ
శ్లాఘించిరి. వారి హృదయములే మహారాజునకు ధన్యవాద
ములు సమర్పించెనో, ఆనోరులేని అమాయకప్రజ లావార్త
విని యెంత బ్రహ్మానందభరితులైరో! తరతరములనుంచి మహా
పవిత్రస్థలముగ బరిగణింపబడిన పద్మనాభస్వామి దేవా
లయ ప్రాకారసమీపమునకేని నాటివఱకు వెళ్ళుట కనుజ్ఞ
నొసగఁబడనివారు ఒక్కసారిగ దేవాలయప్రవేశమున
కనుమతి యొసంగబడినదనివినుట కెంత దీర్ఘముగ, నిశ్చల
ముగ, భక్తిపూర్వముగ ఆ పద్మనాభుని బ్రార్థించియుండిరో!
చివఱ కాయీశ్వరుఁడు వారి మొరాలకించి, మహారాజు
గంభీరహృదయమున, బ్రవేశించి స్వయముగా ఆలయ
ప్రవేశార్హత కలిగించి దర్శనమొసంగియుండును. ఎట్లైనను
తిరువాన్కూరు మహారాజీ విషయములో ఆదర్శపురుషు
డుగా నెన్నవచ్చును.

తరువాత కొన్నాళ్ళకు మద్రాసు ప్రభుత్వమువారు
(కాంగ్రెసు గోత్రీకుల యాజమాన్యమున) హరిజన దేవా
లయ ప్రవేశబిల్లును అంగీకరించిరి. రాజధానిలో కొన్ని
చోట్ల ప్రఖ్యాత దేవాలయములు హరిజనులను ప్రవేశించుట
కంగీకరింపబడినవి. కాని సనాతను లడ్డుతగిలిరి. మతసంబంధ
విషయములలో ప్రభుత్వమువారి కేలాటి హక్కు లేదనియు,
జోక్యము కలిగించుకొనకూడదనియు విమర్శనలు ప్రారంభిం
చిరి. కొందఱు మహాశయులు, దయార్ద్ర హృదయులు,

ఈశ్వరసంభూతులు, దేవాలయములను మూసి ప్రధాన ద్వారమున కడ్డుగ ప్రాణాచారముబడినారు. పాప మెంత విపత్తు వాటిల్లినది? సర్వవ్యాప్తియగు భగవంతుని దర్శనము తమకొక్కరికే ప్రాప్తింపవలెనని యేమో వారి వితండ వాదన? ఇప్పుడేమి? మొదటినుంచి వీరు 'సుస్థిరులు' గానే మెలగుచున్నారు. ఈ ఉద్యమమును ప్రతిఘటించు వారిలో విద్యావంతులు, మేధావులుగలరు. వారినందఱిని పండితులని పిలువవలెనా? పండితులన నెవరు? సమభావ ముగల మహనీయుఁడే పండితుడని శ్రీకృష్ణుడానతిచ్చినాడు. కాని వీరో? సమభావశూన్యులు. పండితులనుటకు బదులు, ఒకచోట శ్రీ కాశీ కృష్ణాచార్యులవారు కృతినందుకొను వేళ సెలవిచ్చినట్లు, (పండితుండే తలప బండి-తుండుగాక!), బండితుండ్లని చెప్ప సాహసమగునేమో! ప్రభుత్వమువారు జోక్యము కలిగించుట క్రొత్త విషయముకాదు. వెనుక పుటలలో తెలుపబడినట్లు మాలవ్యాజీ యాధిపత్యముక్రింద ౨౫-౯-౩౨ నాడే హిందూనాయకులచే తీర్మానింపబడి, యంగీకరింపబడినది.

మహాశ్చర్యమును గలిగించు వేఱొక విశేషమేమనిన, సముద్రప్రయాణ మొనరించి, పాశ్చాత్యఖండములందు చాలకాలమును గడపి, అవిరళముగ నచటి యాచార మర్యాదలను నేర్చుకొని, అలవాటుపడిన విద్యావంతులే హరిజన దేవాలయప్రవేశపు బిల్లును శాసనసభలోన బ్రతి ఘటించుటయే! అట్టి సనాతన పుంగవులు శాస్త్రనిషిద్ధమగు సముద్రయాన మెట్లొనర్చిరో? క్లబ్బులలో తేనీటి నెట్లు

రుచిచూచిరో? కరస్పర్శన లెట్లుగావించిరో? బహుళ కుల
మొకటైనా, క్రిస్టియన్లకన్నా హరిజనులు విపరీతనాగరికతాను
సరణయందు చాల వెనుకబడియున్నారన్న విషయము
వారిని ద్వివిధప్రవర్తనమునకు బురిగొల్పినదేమో? విచిత్రము!

ఇప్పటికైన మహాత్ముని ఆదేశము ననుసరించి భార
తీయులందఱు అస్పృశ్యతా నివారణోద్యమమునకు బ్రయ
త్నించి, సఫలీకృతులై, హిందూమత సామరస్యభావములను
బ్రపంచమునకు వెల్లడి బఱతురుగాక! యని విశ్వసించు
చున్నాను.

---

# రెండవ ప్రకరణము.

## మద్యపాన నిషేధము.

దేశము దుర్భిక్షమై, తినుటకు, కట్టుటకు లేక బలు పాట్లను గుందు బీదవారు త్రాగుడున కలవాటుపడిరి. దాని మూలాన భారతీయులస్థితి మఱింత అధోగతిపాలయినది. కూలినాలివలన సంపాయించుకొనిన యే నాలుగైదణాలలో త్రాగుడునకు వ్యయపఱచి, పరవశులై, ఆరోగ్యమును జెడ గొట్టుకొని, గృహకల్లోలములను బెంచుకొనుచు, పడరాని పాట్లను పడుచుండిరి బీదప్రజలు. తినుటకు లేకపోయినను పరవాలేదుగాని త్రాగుడునకు లేకపోయిన మరణయాతన ననుభవించుచున్నారు. ఈ ఘోరమును మొదలంట రూపు మాపవలెనని మహాత్ముడు బోధించినాడు. మద్యమువలన వచ్చు రాబడితో ప్రభుత్వమును నడుపుట హేయమనియు, బీదప్రజలకు నయాన, భయాన మద్య నిషేధ సారాంశమును బోధించవలసినదనియు నెలుగెత్తి యుపన్యసించినాడు. మొద లంట నాశనమొనర్చు మద్యమువలన వచ్చు రాబడి రాక పోయినను ప్రభుత్వమునకు లోటు కలుగదని సూచించి నాడు. రాబడి తక్కువౌనని మద్యనిషేధ మొనర్పకుండుట స్వార్థపరత్వమని యభిప్రాయపడినాడు. నిజంగా యీ రాబడి ప్రభుత్వమునకు రాకపోయినను నష్టములేదు. ఈ రాబడి యనగా రుధిరాన్నభోజ్యమన్నమాట. ఈ సంగతినే భగ వద్గీతలో స్పష్టముగ జెప్పబడినది. మద్యపానమునుగుఱించి

కాకపోయినను, ఆక్రమపద్ధతులమీద సంపాదించిన దేదియు రుధిరాన్న సమానమనియున్నది. అర్జునుడీవిషయమును శ్రీకృష్ణునితో ప్రసంగించినాడు:—

"...........హత్వార్థకామాంస్తు గురూనిహైవ
భుంజీయభోగాన్ రుధిరప్రదిగ్ధాన్"

(గురుజనులను వధించుటవలన నేను రక్తముచే దడిసిన అర్థకామరూపములగు భోగములే భోగింపవలసియుండును.)

అచట అర్జునుడు గురువులను చంపి రాజ్యభోగములనుభవింపగోరుట రుధిరముచే దడిసిన అర్థ కామరూపములగు భోగముల కాసించుటయేయని చెప్పినాడు. ఇచట నోరెఱుగని బీదలను పీడించి, మద్యపానమును గ్రోలుటకు వారిని మరింత ప్రోత్సహించి, దానివలన వచ్చు రాబడితో ప్రభుత్వ నిర్వహణ మొనర్చుట రుధిరాన్నమున కాసబడినట్లగుటలేదా ? కాంగ్రెసు ప్రభుత్వములు మద్యపాన నిషేధము నమలు జఱుపుట శుభావహము. వారికి సంపూర్ణ విజయము లభించుగాక !.

వర్గ కక్షలను పురస్కరించుకొని మద్యపాననిషేధ ప్రచారమును బ్రతిఘటించుచు, "రోజెల్ల కష్టపడు బీదప్రజలు సాయంత్రముకొద్దిగా, వంటినొప్పులను మరపించునట్టిదగు మద్యమును త్రాగక యెట్లుందురు? వారికది ముఖ్యావసరము."

అని బోధించు విద్యావయోవృద్ధులు నేడు సెలవిచ్చు చున్నారని వినుట దుఃఖదాయకము. ప్రతి దేశమునందు, ప్రతియుగమునం దిట్టి విజ్ఞానవంతులు దౌర్భాగ్యవశమున అవతరించుట సృష్టిలో ముఖ్యావసరమేమో? ఈశ్వరునికే యెఱుక!!

---

# మూడవ ప్రకరణము.

---

## హిందూ మహమ్మదీయ సఖ్యత.

---

భారతదేశమునందు ప్రాముఖ్యత గడించినవి హిందూ మహమ్మదీయ జాతులు రెండే. ఇరుజాతులు సామ్రాజ్యాధిపత్యముతో కొంతకాలమువఱకు ప్రసిద్ధికెక్కినవి. కాని కాలక్రమమున నేడీ రెండుజాతులు సాధారణ ప్రజావర్గములుగ మారిపోయినవి. ప్రతిదేశమునం దంతఃకలహములు, పరదేశీయుల దండయాత్రలు చరిత్రప్రసిద్ధములే. ఇందులో దాపరికమేమి యుండబోదు. ఐనను దండయాత్రలు ముగిసి, అధికారముస్థిరపడిన తరువాత, పరాజయ విజయుల మనస్తత్వములందు మార్పుకలుగుట సహజము. మహమ్మదీయులు భారతదేశముమీద దండయాత్రలు సలిపి, విజయులై, సామ్రాజ్య స్థాపనమొనర్చి, పరిపాలన నారంభించిన తరువాత కొన్నాళ్లకు వారికిని, అంతకు ముందునుంచి స్థిరనివాసముంటున్న హిందువులకు పరస్పర వైమనస్యములుపోయి, ఆదరణ సంఘీభావ సమన్వయము కుదురదొడగెను. అనాదీయులగు హిందువుల ఆచార వ్యవహార, చారిత్రక, సారస్వత విజ్ఞాన విశిష్టతకు దోడుగా, మహమ్మదీయ మత విజ్ఞాన శ్రేష్టలక్షణములు, దేశసౌష్టవ నాగరికతాభి వృద్ధికి సాయపడినవనుట సాహసముకాదు. మన పురాతన శిల్పకళా ప్రాశస్త్యమును నిరూపించు దేవాలయములతోబాటు, వారి ప్రార్థనా మందిరనిర్మాణ ప్రావీణ్యత క్రొత్తదనమును సమ

కూర్చినది భారతజాతీయ కళకు. మొగలు సార్వభౌముడగు షాజహాను చక్రవర్తి తన ప్రియురాలిపేరిట ప్రేమచిహ్నముగా వెలలేని ధనరాసులు వెచ్చించి కట్టించు "తాజమహాలు" దివ్యసౌధము భారతనాగరికత కెంతయో యో వన్నెదెచ్చినది. అదొక్కటియే కాదు. అట్లాంటి వెన్నో ఆసేతుహిమాచల పర్యంతము, ప్రాముఖ్యతకు రాక పోయినను నేటికినికలవు. మతకలహములు కలుగుచుండు టకు కారణము మతవిధానముకాదు; కాని మతావేశ దురభిమానులగు వారి ప్రవర్తనమే.

సర్వసమాన భావ సంపన్నులగు విజ్ఞానులు, ప్రపంచ మతములందు బోధింపబడిన ముఖ్య సూత్రములన్నియు నొకటే యనియు, వాటిని చక్కగా అర్థముచేసికొని పరిశీలించిన పరస్పర సమన్వయము కుదుర్చుకొనుటకు కెంతయో యుప యోగపడుననియు గ్రహించి, ప్రపంచజాతుల కొక దివ్య సందేశము నందజేసిరి. కాని దీర్ఘాలోచనదూరులగు కొందరు ప్రేమగౌరవ భావమును వీడి కలహాకారకులై దేశసౌభాగ్య నిరోధమార్గముల నవలంబించుచుండిరి. దాయాది శత్రుత్వము వలన నెట్లు కుటుంబములు నశించిపోవుట సాధారణవిష యమో, అట్లే యీ మతకలహములవలన దేశసౌభాగ్యము క్షీణించుచుండును. హిందువుల నాగరికత, మత సాంప్రదాయ ములకు ప్రాణాధారమగు వేదములందు, మహమ్మదీయుల పవిత్రగ్రంథమగు ఖురానుషరీఫునందు; క్రైస్తవు లనుసరించి పూజించు బైబిలునందు, బోధింపబడిన విషయములన్నియు

పరస్పర విరుద్ధముకాక, పరస్పర సామరస్యమును పెంపొందించునవిగనున్నవి. మూడుజాతుల దేవుడొకడే. భగవంతునిచే సృష్టింపబడిన మానవులందఱు సమానులే. అట్టి తరి పరస్పర కలహములకు కారణమే కన్పడదు. ఈ విశాల భావము కలిగి దేశమానవ సేవ సలుపువారే మహాత్ములు, యుగపురుషులు అవతారపురుషులు. అట్టివారైనందుననే రామకృష్ణాద్యవతారపురుషులు, మహమ్మదు ప్రవక్త, ఏసు క్రీస్తు భగవత్సమానులని ప్రపంచమునందు ప్రతీతి, విశ్వాసములు కుదిరినవి. మహాత్ముడును అవతారపురుషుడే యనుటకు యీ పుస్తకమునం దెన్నియో దృష్టాంతములు చూపింపబడినవి.

సృష్టి నిర్మాణరహస్య మెఱుగుటకు ప్రయత్నించుట సజ్జనుల ప్రధాన కర్తవ్యమైనది. వారికి జాతిమతభేదములు లేవు. వారికి యావద్విశ్వమునందు భగవల్లీలావిభూతి గోచరమగుచుండును. ప్రతిమానవునికి తొలుత సృష్టివిధానమును తెలిసికొనుట ఊపిరితీసికొనుటవంటిది. ప్రథమధర్మము విస్మరింపబడి, మానవనిర్మిత రాజ్య విషయములను చర్చించి, కూలంకష ప్రజ్ఞ గడించుట పరిపాటైపోయింది. ఈరెండు ఆదర్శములకు హస్తిమశికాంతరభేదముగలదు. మొదటిది ఆధ్యాత్మిక విజ్ఞానముమీద, రెండవది ప్రాపంచికవిషయ పరిజ్ఞానముమీద నాధారపడియున్నది. ఆధ్యాత్మిక వికాసమబ్బనివారే ప్రాపంచికవిషయములకు దేవులాడు కొనెదరు. అందునను వైషమ్యబుద్ధితో ప్రవర్తించిన నెంతయు నికృష్టదశ ప్రాప్తించును. నైతికబలముమీద నాధారపడి, వేదాంత

రహస్య ప్రబోధన మొనర్చు మహాపురుషులు విశ్వకల్యాణము వాంఛించుచు, అస్వతంత్రులగు వారిని పునరుద్ధరింపకపోలేదు. కాని వారి ప్రయత్నము కేవల 'మాత్మ స్వాతంత్రముమీద' నైతిక బలముమీద, వ్యక్తిగౌరవహక్కుశక్తులమీద నాధార పడియుండును. వారు శక్తిలోపము లేకుండ దూరదృష్టికలిగి, న్యాయపద్ధతులమీద ప్రయత్నింతురే కాని స్వార్థపరులై, దుష్టశక్తి సంపన్నులై ప్రాంతీయ దుర్బలజాతిమీద దండెత్తి చివరకు ఎట్టి ఘనకార్యమైనను సరియే సాధింప ప్రయత్నింపరు. రాజ్యవిస్తీర్ణమునందే నిమగ్నులై, కర్కశ హృదయులై శాంతి వాంఛాపరులగు పరదేశీయుల నోడించి, పీడించు నిరంకుశుల హృదయములందుజిక్కి స్వాతంత్ర్యము వాయుప్రసార నిరోధములుగా నొనర్పబడిన జాతులను సంరక్షించిరి పూర్వ ప్రవక్తలగు రామకృష్ణాది అవతార పురుషులు మహమ్మదు ప్రవక్త ఏసుక్రీస్తు. వారి అధ్యాత్మిక సందేశ కారణముననే, నేటికిని వారి దివ్యప్రబోధ బీజము మొలకలెత్తి పెంపొంది ఫలవంతము కాగలిగినది. దైవ సమానులగు మహాపురుషుల జీవితాంశములు దివ్యసందేశమా పాదించుచుండును.

అవతార పురుషుడగు మహాత్మునిది విశాలదృష్టి. విశ్వమానవ కల్యాణాభిలాషి కనుకనే జాతిమతభేదములు పాటింపకుండ మానవసేవ సల్పుటయే తన యాదర్శమని నిశ్చయించుకొనెను. సోదరభావమున మెలగుచు దేశాభి వృద్ధికి పాటుపడవలసిన భారతీయులు కలహించుకొనుట గర్హించి, వారి స్నేహసంబంధముల నభివృద్ధిబఱచ నుద్య

మించెను. మామూలు కుటుంబమునందు కలహములు చెల రేగిననే దైనందిన వినాశము ప్రాప్తించునపుడు విశాలమైన దేశమునందంతఃకలహములు జరుగుచుండిన నెట్టి విపదావస్థ కలుగునో చెప్పనక్కఱలేదు. మనజన్మభూమి, మనభారత దేశము తూర్పున బంగాళాఖాతమువఱకు, పశ్చిమమున అరేబియా సముద్రమువఱకు, ఉత్తరమున నభేద్యమై, ప్రపంచమునందన్నిటికన్న ఎత్తైన హిమాలయపర్వత పాదము వరకు, దక్షిణమున కన్యాకుమారి అగ్రమువరకును విస్తరించి, ప్రపంచమునందు ద్వితీయస్థాన మాక్రమించు కోటానకోట్లజన బాహుళ్యముకలిగి, పుణ్యనదీనదజలకారణసస్యశ్యామలమై, యావత్ప్రపంచమునకు—తక్కినజాతులు కళ్లుతెరువని స్థితిలో నాగరికతా విహీనులై, నికృష్టావస్థ ననుభవించుచుండిన కాలమునందాధ్యాత్మిక—దివ్యసందేశము నందజేసిన మహర్షి గణములకు మాతృశ్రీయై, అవతారపురుషులని పూజింపబడు శ్రీరామకృష్ణ బుద్ధాదీశ్వర సంభూతులను గాంచగలిగిన పూతచరిత్రయై కీర్తిగన్న విషయమెవరు మరువజాలుదురు? కరుణాస్వాంతయై, శీతల కృపాదృష్టులను బ్రసరించి, అమృత హస్తద్వయమునుచూపి, ఆహ్వానించి మానవజాతిని—ఏ దేశము నకు, ఏమతమునకు, ఏయాదర్శములకు సంబంధించినను—తన చల్లని గర్భమునందు నివసింప ననుజ్ఞనొసగిన నాస్తవమెవరు కాదనగలరు? అట్టి దయామయియగు భారతమాతయొడిలో సుఖజీవనమును గడుపవీలున్నను, వైషమ్యానలదగ్ధహృద

యులై, హిందూమహమ్మదీయులలో కొందరజ్ఞానులై
ప్రవర్తించుట ఎట్టి దేశప్రజాకిష్టమగునో చెప్పతరమా?
పరస్పర కలహములందు, ఈశ్వరుడు ప్రసాదించిన ధీ దేహ
శక్తులను తప్పుడుత్రోవలలో నుపయోగించు వ్యర్థజీవుల
ప్రవర్తనమువలన దేశమునందు క్రమశః సంఘీభావము సన్న
గిల్లి, వినాశము కలుగుట తప్పని సరియగును.

ఈ వినాశమునుండి యావద్భారతజాతిని సంరక్షింప
నెంచియే మహాత్ముడు హిందూ మహమ్మదీయ సఖ్యత
కొఱకు శక్తినంతయు ధారపోయుచున్నాడు. వారికి సనాతన
భారత ధర్మోపదేశమార్గములో సన్మార్గుల నొనర్ప ప్రయ
త్నించుచున్నాడు. కలహములెప్పుడు దుష్టశక్తుల వలననే
దాపురించును. వాటి నడచుటకుకూడ తన దివ్యాస్త్రమగు
అహింసాయుధమునే ప్రయోగించుచున్నాడు. నిజముగా
ఏనాడు భారతజాతి పరస్పర కలహములను వదలి, ఐకమత్యత
కలిగి, ఒకేయొక జాతిగా నిలిచి ప్రపంచమునందు గౌరవ
మును గాంచునో, ఆనాడు మాత్రమే మనకు విముక్తి
లభించును. అంతేకాదు, ఆపైన ప్రపంచ సోదరులందరితో
సద్భావమున మెలగుట ప్రయత్నింపవలెను. దానివలన విశ్వ
కల్యాణమునకు భారతజాతి మార్గదర్శకము కాగలదు.
ఈ రహస్యము నెఱిగి సఖ్యభావమున మెలగవలసినదిగా
ప్రియ హిందూమహమ్మదీయ సోదరులకు విజ్ఞప్తి గావించు
చున్నాను.

ప్రతివానికి బాల్యదశలో ముఖ్యముగా బోధింపఁబడు
ప్రథమవిషయము సంఘీభావవిధానము. ప్రత్యేకవ్యక్తుల

మధ్యగాని, సంస్థలయందుగాని సంఘీభావ ముండిననే సామ
రస్యము కలిగి వర్ధిల్లుటకు వీలుండును. అది లేనిచో పరస్పర
వైషమ్యములు, నిరసనభావము, ఎడబాటు సంభవించును.
అంతశ్శక్తియే పునాదిగ స్థాపింపబడిన సంస్థలు చీలికలైపోయి
రూపుమాయును. బాహ్యశక్తుల ద్రోహము నరికట్టుటకు
సంఘీభావమే ప్రధానోపాయము. వ్యక్తిపరమైన, సమిష్టిగత
మైన సంఘీభావమున ప్రాప్తించు లాభము మితిమీరిన
దైనచో ఇక ౪౦ కోట్ల ప్రజలు కలిగి, సస్యశ్యామలో
పేతమై, అమృతోపమానమగు నిర్మల జలము నొసగు పుణ్య
నదులను కలిగి, యోగనిష్ఠమునుగల శాంతప్రదేశమయి ఉప
యోగించు హిమాలయ పర్వతముతో విరాజిల్లునదియై,
ఆధ్యాత్మిక వికాసోదయ భాగ్యము లభించని పాశ్చాత్యఖండ
ములకు విజ్ఞానోపదేశ మొనర్చిన పవిత్ర దేశమై, రక్తపాత
వినోదమున నజ్ఞానులగు పాశ్చాత్యులకు ప్రస్తుతావస్థయందు
అహింసామార్గమును సూచించి, తద్వివిధ ప్రకారముల
నాచరణరూపకముగ బోధించు మహాత్మునికి జన్మభూమియై
వాసిగాంచిన భారతదేశమున వివిధమతస్థులకు సంఘీభావము
కుదిరి, ముక్తకంఠులై ఎలుగెత్తి స్వాతంత్ర్యమంత్రమును పఠించి
కార్యాచరణకు గడంగిన నెట్టి దేశసౌభాగ్య మీవలకు లభిం
చెడిదో చెప్పనక్కరలేదు. నేటి పరిస్థితులు సరిగా విరుద్ధ
ముగానున్నవి. వివిధసంస్థలయందు సంఘీభావము కుదుర
లేదు. హిందూమహాసభయని, ముస్లింలీగుఅని, కాంగ్రెసు
యని, లిబరలు ఫెడరేషనుఅని, జస్టిసుపార్టీఅని యీవిధంగా

అనేక సంస్థలు భారతదేశమునందుగలవు. ఏదోయొక గొప్ప పేరు గడించు ఉద్దేశ్యముతో కొందఱు వ్యక్తులుకలిసి ప్రత్యేక సంస్థను లేవదీయుట రాజకీయములందు ప్రతిదేశమునను పరిపాటైపోయినది. స్వతంత్రి దేశములం దెన్నిసంస్థలున్నను మించినదిలేదు. అవిఅన్నియు దేశసౌభాగ్యమునకు, దేశాభివృద్ధిగౌరవములకు పాటుబడును. కాని, దాస్యమనుభవించుచు, విముక్తికొఱకు సర్వశక్తుల వినియోగించి ప్రయత్నించు భారతదేశమునం దిన్ని ప్రత్యేకాభిలాషలుగల సంస్థలవలన మేలుకన్న అనర్థకమే ఎక్కువ. అన్నియు స్వాతంత్ర్య సంపాదనకు ప్రియత్నించిన నెంతయో శ్రేియస్కరముగా పరిణమించును. ప్రిధానఆశయ మొకటేయైనచో సంఘీభావము కుదిరినట్లే. ఉదాహరణకు దేశస్వాతంత్ర్య సంపాదన విషయమునందు కాంగ్రెసు దృష్టియందున్నవిధానము వేఱు, ముస్లింగుదివేఱు, హిందూమహాసభవిధానము వేఱు. ఈరీతిగా వ్యత్యాసములున్నచో ఇక సంఘీభావమునకు తావెక్కడిది? ప్రధానాశయమునం దభిప్రాయబేధములున్నను, కులవైషమ్య ప్రాముఖ్యత లేనంతవఱకు పరిస్థితులు పూర్తిగావ్యతిరేకముగా నుండవు. కాని మతబేధములకు సంస్థల నిత్య కార్యప్రిణాళికయందు తావొసగినచో తలపెట్టబడిన మహత్కార్యము కొనసాగకుండుటయేగాక, విపరీతపరిణామము దాపురించును. అనుకొన్నదొకటి, అగునదొకటి. దీనివలన ఆయా సంస్థలనకుపు నాయకులకుగాని, దేశమునకుగాని ఏలాటి మేలు కలుగబోదు. అసందిగ్ధ ప్రివర్తనమునకు దిగనియెడల కీడు

కాని మేలుకాని సమకూరదు. అట్లుకాకుండ బుద్ధిపూర్వక
ముగా వ్యక్తిదూషణ, వ్యతిరిక్త ప్రవర్తనవలన మితిలేనంత
కీడు దాపురించును. కీడు కలిగించినవారు ద్రోహులేకాని
లాభకారులు కాజాలరు. దేశద్రోహుల మూలమున ప్రత్యేక
సంస్థలకే కాకుండ ప్రజానీకమునకును తీరని నష్టము కలుగును.

ప్రతిసంస్థకు కొంతమంది ప్రజలు అనుయాయులుగా
నుండుట సహజము. ప్రజాబల మెక్కువగా లేకపోయినను,
వాక్శూరులగు వ్యక్తులైన ఉందురు. ప్రజాబలము కలిగిన
సంస్థల కెక్కువ ప్రాధాన్యమొసగబడును. వివిధాభిప్రాయ
సమ్మేళనమువలన నెక్కువ లాభము కలుగును. సంస్థయొక్క
కార్యప్రణాళిక స్థిరముగాను, ప్రజోపయోగముగానుండును.
ప్రతిసంస్థకు ప్రజాబల ముండును కనుకనే వివిధసంస్థల మధ్య
సంఘీభావ ముండితీరవలెను. ఈ ప్రజలయం దాశయబేధములే
కాక, మతాభిప్రాయబేధములుకూడ నుండును. కొన్ని మత
ములు ప్రధాన మతశాఖలైనప్పటికి, తక్కినవి పూర్తిగా
విరుద్ధములై ఉండును. ఈ వైరుధ్యము సమన్వయదృష్టితో
నాలోచించిన ప్రబలమైనదిగ గానిపించకపోయినను కలహ
కారణమగుట కుపయోగపడును. మతావేశపరులగువారు
స్వదేశీయులలో స్నేహభావము నభివృద్ధిపఱచ ప్రయత్నింపరు.
స్నేహభావము లేనినాడు కలహములు చెలరేగును. దాని
వలన ప్రజానష్టము కలుగును. దేశమం దశాంతి ప్రబలును.
ఈ కుతంత్రము స్వార్థపరులు తమ నిత్యజీవితమునం దాచర
ణలో పెట్టెదరు. వారి దుశ్చేష్టలనుండి అమాయకులగు
ప్రజలను సంరక్షించుటయే దేశనాయకుల ముఖ్యకర్తవ్యము.

భారతదేశము విదేశీయుల దండయాత్రల కేలగురి యైనది, తదనంతరము రాజకీయపరిస్థితు లెట్లు విషమించినది విచారించుట అప్రస్తుతము కాదని నా యభిప్రాయము. భారతవంశ మంతరించినతరువాత హిందూదేశమునం దరాజకము ప్రబలలేదు, జగదేకవీరులగు క్షత్రియపుంగవుల పరిపాలనయం దేలాటి తిరుగుబాట్లు జరుగలేదు. కాని దురదృష్టవశాత్తు కాలముగడచినకొలది పాలకులు ధర్మన్యాయపద్ధతులను విడనాడి ప్రజాక్షేమమును విస్మరించి, స్వార్థపరులై, రాజ్యవిస్తీర్ణ కాంక్షాపరులై, విషయాలోలురై ప్రవర్తించిరి. ఏనాడు పాలకులు విషయవాంఛలకు లొంగిపోయిరో ఆనాడే భారతదేశ సౌభాగ్యమునకు చేటు కలుగ నారంభమైనది. క్రమశః సార్వభౌముడు బలహీనుడగుటయు, సామంతరాజు లధికారప్రాబల్యమునకు పెనకులాడ ప్రయత్నించుటయు హెచ్చుమీరినది. స్వసైన్య విస్తీర్ణమునకు గడంగి, దౌర్జన్యమునకు దిగి, తనతోడి తక్కినబలహీనులగు సామంతప్రభువుల నోడించి, సార్వభౌముని యధికారమును ధిక్కరించి అతనిని పదవీచ్యుతిని చేయుటకై కుట్రలు పన్ని, నానా భీభత్సలను సలుపుట మామూలైపోయినది. సార్వభౌముడు సామంతుల తిరుగుబాటును తెలివితేటలతో నణచగల శక్తి లేకపోయినను, స్వగౌరవ రక్షణార్థమైనను వేలకొలది సైన్యములను పంపి ఘోరయుద్ధముల నొనరింపదలపెట్టెను. యుద్ధకారణములవలన దేశమునందు శాంతి, ప్రజారిష్టము కలుగదొడగెను. పాలకులయెడల ప్రజలకు, ప్రజల మీద పాలకులకు అనురాగ శ్రద్ధాభక్తులు నశించి, యీర్ష్య,

నిరంకుశత్వము, తిరుగుబాటు ప్రబలమగుచుండెను. పాలక వర్గమునందు సంఘీభావము లేకుండెను. పరస్పర మాత్సర్య, వైరుధ్య భావములు దైనందినాభివృద్ధి గాంచెను. ఎట్లైనను సరే శత్రురాజును పరాజయునిగా నొనర్చి స్వీయ గౌరవాధి కారముల నతనిచేత నొప్పింపజేయు కుతంత్రాలోచనలు జటి గెను. సంఘీభావములేక, పాలక, పాలితుల మధ్య అనురాగ గౌరవములు నశించి, దేశరక్షణ విస్మరింపబడి, అరాచకము ప్రబలిన దేశము విదేశీయుల దండయాత్రలకు గురియై ఓడింపబడుట సులభసాధ్యమేగదా!

పృథ్వీరాజ జయసింగుల పరస్పర వైషమ్యములు విష మస్థితికి వచ్చిన తరుణమునందే భారతదేశమునకు గొప్ప అనర్థకము వాటిల్లినది. పరస్పర కలహములందు నిమగ్నులై యున్నను, విదేశీయుల కుట్రలకు తావొసంగకుండ నుండ వలసియుండెను. కాని బుద్ధి పెడదారి బట్టి తద్వ్యతి రేకముగా పరిణమించెను. ఆనాటినుంచి దేశమం దెంత అల్ల కల్లోలము జరిగినది చరిత్రకారు లిదివఱకే రచించిరి. మొ గలు ప్రభుత్వము స్థిరపడినతరువాత అక్బరు సార్వభౌముని ధర్మపాలనయందు హిందూమహమ్మదీయ సంఘీభావము మఱల పెంపొంద నారంభించినది. ఆనాటి ఏకీభావ మెట్లు దేశపాలనా సౌభాగ్య ముఖ్యకారణమైనది అందరికి విదితమే. అక్బరు చక్రవర్తి దయార్ద్రహృదయుడు, శాంతిప్రియుడు, అసమాన రాజకీయకీర్తి, మతసహనము కలిగి సర్వజన సౌఖ్యముకొఱకు పాటుబడిన విశాలహృదయుడు. అతని

తరువాత పునఃమతవైషమ్యములు ప్రారంభమైనవి. స్వార్థపరుల కృషిమూలకంగా అవి మరింత రేగినవి. రక్తపాతము జరిగినది. స్నేహవాత్సల్య సహనములకు బదులు వైరుధ్య, మాత్సర్య, యీర్ష్యాభావములు రూపించినవి. తిరిగి దేశము నందరాజకము, అశాంతి ప్రబలదొడగెను. అదివఱకే వర్తకమును సాగించుకొనుటకై పరదేశములనుంచి వచ్చి నివాసమేర్పరచుకొని, పలుకుబడి సంపాదించుకొనిన యూరోపియను జాతీయులు దేశవిషమపరిస్థితుల నాధారముగాగొని రహస్యప్రవర్తనతో పాలకపరిపాలితుల సంబంధములందు వైషమ్యమును కల్పించి అధికారప్రాప్తికై పెనగులాడిరి. దానిని భారతీయులు కనుగొనజాలక వెఱ్ఱిబాగులవారై, మతకలహమగ్నులై వారాపలేకపోయిరి. ఎట్లైతేనేమి యూరోపియనులు విజయులైరి. వారిలో బలవంతులును, మేధావంతులును, శక్తిసంపన్నులగు ఆంగ్లేయులు తక్కినవారి నోడించి సంపూర్ణాధికారులై దేశపాలన నారంభించిరి. పాలనాధికారము లేకపోయినను, ఆర్థికదుస్థితి కలిగినను, దాస్యభారమనుభవించవలసివచ్చినను, భారతీయుల పరస్పర మతాద్వేషములు మాత్రము వృద్ధియగుచున్నవేగాని మాటుమణగి సంఘీభావము కుదురలేదు.

కాని కాలపరివర్తన ననుసరించి, దేశమునందు స్వపరిపాలనా కాంక్ష జనించి దినదిన మభివృద్ధిజెంద దొడంగెను. నిరాయుధస్థితికి దేబడినవారగుటచే అస్త్రబలము మీద నాధారపడి ప్రతిఘటించి స్వాతంత్ర్యసమరమును సాగించుటకు

వీలు లేకపోయినది. పాలకులు బలవత్తరులు— భారతీయులు నిరాయుధులు—దౌర్జన్యపద్ధతులకుగడంగి పోరాడినను వినాశన మేగాని కార్యవిజయము కలుగుట అసాధ్యము. ఐనను కొందరు ఎదురుతిరిగి, మొండిసాహసముచేసి దౌర్జన్యము నొనర్చిరి. దానివలన నెట్టి విపరీత పరిస్థితులు పరిణమించినవి అందరికి తెలిసినవిషయమే. ఈరహస్యమును గ్రహించియే మహాత్ముడు దౌర్జన్యమును విడనాడి, అహింసాపద్ధతులమీాద స్వాతంత్ర్య సమరసన్నాహములకు బూనుకొనెను. ప్రజానీక మందైక్యత లభించనిదే ఎట్టి మహత్కార్యమైనను ఫలింప జాలదు.

భారత దేశమునందనేక తెగలవారు గలరు. ముఖ్యులు హిందువులు, మహమ్మదీయులు, క్రైస్తవులు. ఈ త్రివిధ మత మూలసూత్రము లొకటేయైనను స్వార్థపరులై, మూర్ఖత వలన విద్వేషచర్యల నొనర్చుచుందురు ప్రజలు. సాధారణ ముగా మతకలహములవలన దేశమునందు గొప్ప అలజడి కలుగును. మతవిద్వేషమువలన కలహించువారలకు దేశ సౌభాగ్యము, స్వాతంత్ర్యసమరసన్నాహ నిర్వహణము తృణ సమానము. వారికి జాతీయత యనునదేదో తెలియదు. అహం భావము మాత్రమే వారిహృదయములందు జీర్ణించుకొని పోయి, విశాలదృష్టి మందగించి, మానవత్వమును మరుగు పరచి, పశుతుల్యులుగా నొనర్చు క్రోధప్రవాహములను ప్రకోపింపజేసి, వినాశకులుగా నొనర్చును. ఇట్టి మూర్ఖుల కారణముగ దేశారిష్టము వాటిల్లును. సంఘీభావమున

మెలగుచు సమిష్టి ప్రయత్నము జేసిన నేగాని ఏ దేశస్థుల కైనను స్వాతంత్ర్య సమరవిజయము లభించదు. ముఖ్యముగా బానిసత్వము ననుభవించు భారతదేశప్రజలకు సంఘీభావము ప్రబలతరముగ నుండవలసిన అవసర మెంతయో గలదు. రాచకీయములందు కాకపోయినను, దేశమధ్యమున నేలాటి కలహములు జరుగకుండ సత్యజీవితము సక్రమముగా సాగుటకైన ఐక్యత ముఖ్యముగా స్థిరపడవలసియుండును. ఆంతరంగిక కలహములవలన సంభవించు అనర్థకములు, పరదేశీయుల దండయాత్ర ఫలితములకన్న వేయిరెట్లు జాతిని నిర్వీర్యమొనర్చును. నేటి దేశపరిస్థితులు వ్యతిరేకించినవి. హిందూమహమ్మదీయ మతసంఘర్షణ లేకాకుండ, మేధావంతులగు కొందరు నాయకులు తమతమ ఆశయాభిప్రాయములను సమకూర్చుకొను ఉద్దేశ్యముతో ప్రత్యేక సంస్థల నేర్పరిచి వాటిద్వారా ప్రచారమొనర్చుచున్నారు. ప్రతిసంస్థకు కొందరు అనుయాయులుండుట మనమెరిగిన విషయమే. ఏపద్ధతుల నవలంబించుటకై, ఏఆశయములను ఫలింపజేసికొనుటకై ప్రత్యేకసంస్థలు స్థాపింపబడినవో, వాటి సభ్యులై వారాయా ప్రచారమున కనుగుణ్యముగా సంచరించవలసియుండును. ప్రతిదేశమునందు వివిధాభిప్రాయములతో స్థాపింపబడిన సంస్థలుండుట సామాన్యమైనసంగతే. వ్యక్తిగౌరవముకన్న సంస్థగౌరవమెక్కువ ప్రాముఖ్యతగలదిగా నుండును. వివిధసంస్థలు దేశోపయోగార్థము సర్వత్యాగమొనర్చి, నిష్కళంక దేశభక్తితో ప్రచారముసల్పుచుండును. స్వతంత్ర్య రాజ్యములందీ సంస్థలవలన సమకూరు లాభ

మంతింత కాదు. తక్కిన ఇతరప్రదేశములందువలె భారతదేశ మందుకూడ సంస్థలుగలవు. నిజముగా ఎక్కువేఉన్నవి. కాని సత్వమును వదలించుకొను సదుద్దేశ్యముతోడనే యివి స్థాపింపబడినవి. తదాశయము నెరవేర్చుకొను పట్టుదలతోనే యివి ప్రజలయందుత్సాహభక్తిశ్రద్ధలను కలిగించ గలిగినవి. ఐతే యీవివిధసంస్థలయందుండవలసిన సామరస్యము, సహానము, ఏకీభావము మాత్రము శూన్యము. వీరిపాలన చేజిక్కినతరువాత నెట్లువాదించినను, ఏవిధముగా ఆచరించినను అనర్థకము వాటిల్లదు. అభిప్రాయభేదములున్నను గొప్ప నష్టము కలుగదు. దేశపరిపాలన జరుగకుండ విఘ్నము సంభవించదు. మెజారిటీపార్టివారి కృషియేఫలించును. కాని దాస్యభారమునక్రుంగి, బీదతనముచేత నల్లాడుప్రజలలో వైషమ్యములు చెలరేగి కుతంత్రాలోచనలు సాగుపక్షమున లభించునదేమున్నది? విషమావస్థయే.

నేటి మనదేశమునందు ప్రాబల్యమును సంపాదించి ప్రభుత్వమువారిచే మన్నింపబడు ముఖ్యసంస్థలు మూడు. ఒకటి కాంగ్రెసు, రెండు ముస్లింలీగు, మూడు హిందూమహా సభ. ఇవికాక తక్కిన చిల్లరసంస్థలెన్నో ఉన్నవి. కాని వాటి కెక్కువ ప్రాముఖ్యతలేదని చెప్పవచ్చును. కాంగ్రెసు గోత్రికులు మొదటినుంచి స్వాతంత్ర్య సంపాదనకే సర్వస్వము త్యాగమొనర్చినారు. వారు అహింసావిధానము ననుసరించె దరు. వారిది శాంతియుతసమరము. ఈసంస్థ ముఖ్యముగా జాతీయగౌరవమును ప్రజలకు బోధించునిమిత్తము స్థాపింప బడినది. ఇందులోజేరి దేశసేవజేయుటకు మతవివక్షులతో

అవసరము లేదు. ఏమతస్థుడైనను, ఏతరగతివాడైనను దేశారాధనాతత్పరతకలవాడైన చాలు సభ్యులుగా జేరి పనిచేయవచ్చును. దాననే యీసంస్థయందు హిందువులు, మహమ్మదీయులు, క్రైస్తవులు, పార్సీలు, యూదులు తదితర వివిధ మతావలంబకులు సభ్యులుగా జేరి దేశసేవ నొనర్చుచున్నారు. వీరు దేశభక్తి, త్యాగము, అహింస, శాంతి, సేవా మొదలగు ఉత్తమోత్తమగు ఆశయములుకలిగి స్వాతంత్ర్య సంపాదనకు ప్రయత్నించుచున్నారు. వీరుచూపిన ధైర్యసాహసములు, అసమాన త్యాగశక్తి ప్రపంచదృష్టి నాకర్షించినవని చెప్పుట అతిశయోక్తి కాజాలదేమో! తరువాత ముస్లింలీగు. దీని నాయకుడొకప్పుడు కాంగ్రెసు ప్రథమశ్రేణినాయకులలో పూజ్యుడుగా గౌరవింపబడిన అసమాన మేధాసంపన్నుడు. అభిప్రాయభేదములవలన కాంగ్రెసునుంచి వైదొలగి ప్రత్యేక సంస్థ నొకదానిని స్థాపించి స్వాభిప్రాయములను ప్రచారమొనర్చుచున్నాడు. భారతదేశమునందు కాంగ్రెసు తరువాత ముస్లింలీగే గొప్పది. ఇందులో చాలమంది సభ్యులుగలరు. ముఖ్యవిశేషమేమన తమ మేధాసంపత్తిచేత ప్రభుత్వము నందున్నత స్థానమాక్రమించి మన్ననలందిన ఉద్యోగస్థులు, ధనవంతులు, భూస్వాములు సభ్యులుగాగలరు. కాంగ్రెసు సభ్యులవలె నెక్కువత్యాగము చేయవలసిన అవసరము లేనందున చాలమంది విద్యాధనవంతులిందులో జేరుట కవకాశ మేర్పడినది. కాని లీగుప్రెసిడెంటు సామాన్యుడు కాడు. ఇతనికిగల దేశభక్తి అపారము. ధైర్యసాహసములతో స్వాతంత్ర్యమునకై యనుపోరాడు రాజకీయవేత్త. స్వల్ప

లాభముకొఱకు చేజాచి తన సంకల్పమునకు విఘాత మొనర్చుకొనక నిష్టపడని స్వాభిమాని. ముస్లింలీగునకు, కాంగ్రెసునకు ప్రధానాశయములొకటేయైనను అభిప్రాయ భేదములెందుకు కలిగినవి? సత్యాహింసలద్వారా, ప్రేమ మయ హృదయములతో త్యాగశీలురై, అధికారుల హృదయ పరివర్తనమునుగల్పించి యిష్టపూర్తిగా స్వేచ్ఛనొసంగు లాగున ప్రయత్నింతురు కాంగ్రెసుగోత్రికులు. వారు కారా గారవాసకష్టములనుకూడ సహింపగలుగుదురు. కాని ముస్లింలీగు ధోరణివేరు. ఏవిధముగానైన—అహింసావిధాన మున లేక దౌర్జన్యపద్ధతులమీద చిరస్థాపితమగు ప్రభుత్వ ముతో సంఘర్షణపనికిరాదనియు, ఎసెంబ్లీసభ్యులుగా జేరి పరిపాలనాపద్ధతులను బాగుగ గ్రహించి జోక్యము కలిగించు కొని, స్వాతంత్ర్యసంపాదనకు గడంగవలసినదిగా ప్రజలకు బోధించుటయే వీరి ముఖ్యవిధానము. కాంగ్రెసులోవలె లీగునందు—మహమ్మదీయులుతప్ప—తక్కిన మతాలవారు కనబడరు. కనుకనే దీనిని రాజకీయసంస్థకాకుండ మతసంస్థ యని విమర్శించుటకు వీలుకలిగినది. పైగా లీగుసభ్యులు భారతమహమ్మదీయ సోదరుల ఆర్థిక, సాంఘిక, రాజకీయ పురోభివృద్ధికై పాటుపడుచుండుట సుప్రసిద్ధ విషయము. ఒకప్పుడు నిరంకుశపాలకులై, దుర్నిరీక్ష ప్రతిభావంతులై యావద్భారత దేశమునకు పాలకులగు మేటిపీరుల వారసుల మనియు, బ్రిటీషుప్రభుత్వమువారు దేశాక్రమణకు గడంగి విజయులైనప్పుడు పాలించు జాతి మహమ్మదీయులనియు, కనుక తమకు పూర్వాన్నత్యము రావలసియున్నదియు వీరి

ఆంతరంగికాభిప్రాయము. విదేశీయులు దండెత్తకమునుపు పాలించు జాతి హిందువులనియు, అవిచ్ఛిన్నముగా అనేక వేల ఏండ్లు దేశమును పాలించినది హిందూమహారాజులనియు, కనుక పాలనాధికారము పునః తమకే రావలసియున్నదని హిందూమహాసభాసభ్యుల ప్రతివాదము-అధిక సంఖ్య వర్గముయగు హిందువులకు పాలనాధికార మొసంగినచో తక్కిన యితర చిన్న పార్టీవారికి తీరని నష్టము కలుగునని లీగు వాదన. ఉన్న మెజారిటీ హక్కును పోగొట్టుకొనుటకు వీలులేదనియు, మైనారిటీల కేలాటి న్యాయసంబంధ హక్కుల కన్యాయము కలిగించమని వాగ్దానమొసగుచున్నాము కనుక దేశపరిపాలన మా హస్తగతము కావలెనని హిందూమహాసభవారి నిశ్చితాభిప్రాయము. కనుకనే యీ రెండు సంస్థలు పరస్పరము వాదప్రతివాదములందు తలలు తలలు డీకొట్టుకొనుచుండుట తటస్థించినది. ఐతే కాంగ్రెసువాదన ఏమి? ఏమతస్థులైనను సరే ముఖ్యముగా కావలసినది భారతదేశము భారత ప్రజానిధులచేత పరిపాలింపబడడమే, దేశము సుభిక్షముగా నుండడమే, మరల తక్కిన జాతులవారికి భారతదేశము శాంతిసందేశము, ఆధ్యాత్మిక విజ్ఞానప్రబోధము నిరాటంకముగా అందజేయవలసినదే.

పైన చెప్పినరీతిగా ఆశయము లొకటేయైనను వాటిని ఆచరణయందుంచి ప్రయత్నించు విధానమునం దభిప్రాయ బేధముకలిగి ప్రవర్తించుచున్న వీ మూడు ముఖ్యసంస్థలు. వీటికిబదులు అన్ని కులాలవారుజేరి సమిష్టిసంస్థనొకదానిని స్థాపించి దేశస్వాతంత్ర్యమునకై పోరాడుట జరిగిన బాగుం

డెడిది. అట్టి శుభసమయము దాపురించినచో స్వాతంత్ర్యము దానంతట అదే వచ్చితీరును. కాని ముఖ్యముగా కావలసిన ఏకీభావము శూన్యమైనది.

దురదృష్టవశాత్తు నాయకులు ప్రధానాశయములను విస్మరించి, అభిప్రాయభేదములను ప్రచార మొనర్పదలచి, మతావేశపరులగు చున్నారు. తత్కారణముగ, ముస్లింలీగు వారు పాకిస్థాన్ స్కీమును తయారుచేసి అమలునందుంచ ప్రబల యత్న మొనర్చుచున్నారు. ఈ స్కీమువలన కలుగు దేశారిష్టముల నీవఱకే తక్కిన పార్టీనాయకులు బహిరంగ ముగా చాటినారు కనుక విస్తరింప నవసరములేదు. మెజారిటీలో ఉన్న రాష్ట్రములందు నివసించు ముస్లింసోదరుల ప్రత్యేక ప్రభుత్వ నిర్వహణముకొఱకు కొంత భారతదేశ భాగమును ధారపోయవలసినదని యీ స్కీమువలన తేలు ప్రధానోద్దేశము. ఇట్లు జఱుగుట చాల అన్యాయము. మన దేశము స్వాతంత్ర్య మనుభవించుటలేదు. ఇంకను బానిసత్వ భారమునే సహించుకొనుచున్నది. తొలుత యీ సంస్థలు స్థాపింపబడిన విదేశారాధనకొఱకు, దేశస్వాతంత్ర్యముకొఱకు ఇప్పుడా ఉత్తమాశయములను వదలి, దేశవిభజనకు గడం గుట ఎంత ఘోరము.

ప్రారంభమునుంచి మహాత్ముడు స్వాతంత్ర్యసంపాదన కార్య ప్రణాళికయందు నిర్బంధపరచిన నియమము ప్రకారము దేశస్థులందరు మతసామరస్యముకొరకు, మతసంఘీభావము కొరకు ప్రయత్నించిన నేడు యీ విపరీతాభిప్రాయములు, నూత్నపరిపాలనావిధానములుబహిర్గతమగుటకు వీలులేకుండె

డిది. పైగా కొందరు బుద్ధిమంతులు మహమ్మదీయులతో స్నేహమొనర్చుకొని కలసిమెలసి యుండవలసినదని, వారి సహకారము లేనినాడు దేశసౌభాగ్యమే కుంటువడునని మహాత్ముడు చెప్పినందుకు విపరీతప్రశ్నలను వేయుచున్నారు. ఉదాహరణముగా ౨౭-౧-४० "హరిజన" పత్రికయందు మహాత్మునికి మరొక విద్యావంతునికి జరిగిన సంవాదమును తెలుగునగూర్చి పొందుపరుపబడినది:—

"ఒకనాడొక ఆగంతకుడు వచ్చి నాతో యీవిధంగా సంభాషించినాడు. మతసంఘీభావము లేనిదే ఇండియాకు స్వరాజ్యము రాదని ఎలుగెత్తి చాటుతూ మీరు మితిలేనంత ద్రోహము చేయుచున్నారు. ఐక్యతకు బదులు వివిధమతస్థులకు సమానముగా న్యాయము జరుగవలెనని చెప్పిన బాగుండెడిది. నేను చాలవఱకు ఆతనికి నచ్చచెప్ప ప్రయత్నించితినికాని సంతృప్త హృదయుడు కాలేకపోయినాడు. ముస్లింస్నేహితుల హృదయాంగీకారముకొఱకు మీరు సర్వస్వమగు ఆత్మనే అమ్మదలచినారనెను. అట్లనుట నిరసించి, ఇండియాకు స్వాతంత్ర్యమును సంపాదించుటకై నా ఆత్మనెన్నటికి అమ్ముకొనజాలనని మీకు ప్రపంచమంతటికి తప్పక తెలిసిన విషయమే. ముస్లిములతో స్నేహము వాంఛించుట స్వార్థమునకుకాదు. కాని ఇండియాకొరకే. మీరు నాయందు చాల నిర్దాక్షిణ్యము వహించినారని చెప్పినను ఆవేశపూరితుడై నామిత్రుడు, మీ దేశభక్తి నాకు తెలియును. ఎఱుగనివాడనై నచో ప్రత్యేకముగా మీ కడకు రానివాడనే. కాని మీ దేశభక్తి యిదివఱకుచేసిన, యిప్పుడు

చేయుచున్న యీతప్పిదాన్ని మరుగుపరచి తెలిసికొనలేకుండ చేయుచున్నది. హిందువులేమిచెప్పి చేయుదురో మీకు తెలియదు. ముస్లిములకు కోపము కలుగబోవునేమోయని వారు మీయందు గాఢనమ్మకము గలవారు గాన లోలోననే అవస్థపడుచున్నారు. కనుక "ఐక్యతకు" బదులు "న్యాయము"ను ప్రచారము చేయవలసినదిగా మిమ్ములను ప్రార్థించుచున్నానని అన్నాడు. ఆతనితో వాదించినందున ప్రయత్నిము లేదు, నాకున్ను విరామము లేదు. ఈవిషయాన్ని "హరిజన"లో విపులపరచెదనని మాటయిచ్చినాను. అదికొంతవరకాతనిని ఓదార్చుటకు కారణమయినది. నాప్రత్యుత్తరము కుదుటపరచ గలదని నాకునమ్మకము లేదు.

అహింసాపద్ధతులమీద, మతైక్యతలేనిచే స్వరాజ్యము లభించదని నాకు సంపూర్ణమగు నమ్మకముగలదు. న్యాయము జరుగకుండ ఐక్యత లభించదు. ముస్లిములతోగాని, మరిరే యితర కులాలవారితోగాని ఐక్యత లంచమిచ్చికొనుటకు వీలులేదు. లంచమిచ్చుట పిరికితనము కనుక అది దౌర్జన్యమే. రావలసినదానికన్న ఎక్కువేమైన నాసోదరునికిచ్చినచో తద్వారా లంచమివ్వడము కాని, అన్యాయము జరుగుట కాని సంభవించదు. ఉదారతయే అనుమానాన్ని పారదోలును ఉదారతలేని న్యాయము పైలాకు తలపెట్టిన న్యాయమునకు సమానమగును. ఎట్లున్నను, ఏ అభిప్రాయముతో ఐక్యతకు పాటుపడుచున్నానో దానికే విరుద్ధము జరుగులాగున ప్రయత్నించకుండుటకు తప్పక జాగ్రత్త వహింతును.

కనుక ఐక్యత సాధింపవలెననే అభిప్రాయమునుకాని, తత్ప్రయత్నమునుకాని వదలిపెట్టలేను. ప్రచురణరూపముగా జిన్నాగారు నాకొసగిన ప్రత్యుత్తరమెట్లున్నను, ఆయన నిజముగాయావత్తు ముస్లిముల అభిప్రాయమును రూపించుచో సంఘీభావమును సమకూర్చవలెననే నాఆశయమంతయుమంట గలపినట్లే. వివిధరాజకీయసంస్థల విషయమై ఒకేపద్ధతి నమలులోపెట్టుటకై ఆయన ఆచరించువిధానముయొక్క నిజమైనఅభిప్రాయమును బహిరంగపరచు నానిర్వచనమును విమర్శించుట వలననొక అపూర్వపరిస్థితి ఏర్పడినది. మతానుసారముగా వివిధ జాతులుకలిసి భారతదేశమేర్పడినదను ఆయన నిరూపణ ఆచరణపూర్వకముగ ఫలించినచో గత ఏబదిసంవత్సరముల నుంచి కాంగ్రెసుసంస్థ ప్రయత్నించునదంతా వృథాయై పోవును. ముస్లింలీగు చరిత్రయందు జిన్నాగారిభాగము క్షణమాత్రమే అని నేను ఆశించుచున్నాను. వివిధరాష్ట్రములందలి ముస్లింలు తమ హిందూక్రైస్తవ సోదరులనుండి ఎన్నటికి వేరుకాజాలరు. ముస్లింలు, క్రైస్తవులు హిందూమతము నుండి నూత్నమత మవలంబించినవారైన, లేక వారి వారసులైన యగుదురు. మతమును మార్చుకొనినంతమాత్రమున తాము నివసించురాష్ట్రములను విడువజాలరు. ముస్లింలైన ఆంగ్లేయు లెన్నటికి తమ జాతీయతను వదలుకొనరు. తన అనుచరుల నిశ్చితాభిప్రాయమును జిన్నాగారు నిరూపింపజాలరని నాఆశయము."

ప్రస్తుత వివాదములనన్నిటిని త్యజించి, ఏకీభావముతో మెలగుచు, స్నేహాభివృద్ధిని వాంఛించి, భారతీయ

లందరొకే జాతియను పేరుగాంచి, సహనభావముతో, ధైర్య, సాహస, త్యాగ ప్రదర్శనముతో స్వాతంత్ర్య సంపాదనకు బూనవలసినదిగా సోదరులందరికి నా ప్రార్థన.

మహాత్ముని తపస్సుఫలించి, భారతీయులందరైక్య కంఠముతో స్వాతంత్ర్యమంత్రమును జపించి తత్ప్రయత్నములను సాగింతురుగాక. పునఃభారతదేశమునందు చిరముగ శాంతి నెలకొని, ఆధ్యాత్మికవికాసమునుపొంది, ఔన్నత్యమును సంపాదింతురుగాక.

---

# నాల్గవ ప్రకరణము.

## వార్ధావిధానము — వృత్తివిద్య

ప్రస్తుతము మన దేశములోని విద్యావిధానము లోప భూయిష్టముగా నున్నదని మహాత్ముడు-మన పురాణగురుకులము లందనుష్ఠింపబడి యున్నట్లుగానే కొద్దిభాషాభేదముతో సత్యాహింసలను రెండుచక్రములపైన విద్యాప్రచారమును సాగించువిధానముగ-వార్ధావిధానము బయలు దేరదీసినాడు. వార్ధావిధానమునుగురించి శ్రీ తత్వానంద స్వామిగారొక గ్రంధమును రచించిరి. అందనేకవిషయములు విపులపరుపబడినవి. వాటిలో కొన్నింటినిట నుదహరించెదను:—

"శ్రీ గాంధీజీ సత్యమనగా పరమాత్మయనియు, అతడీ జగమంతయు వ్యాపించిన సర్వాంతర్యామియగు భగవంతుడే యనియు తెలుపుచున్నాడు. ఆసర్వేశ్వరుని ప్రత్యక్షముచేసికొనుటయే వారుబోధించు సత్యాన్వేషణమునకు పరమావధి. ఈ సత్యాన్వేషణము సర్వజీవులను ఆత్మసమానముగ ప్రేమించి సేవలొనర్చుట మూలమున సాగవలసియున్నది. సర్వజీవసేవయే భగవత్సేవ. ప్రతిమానవుడును తనశక్తి సామర్థ్యములున్నంతవరకు ఈ అన్వేషణమును చేయవలసియున్నది. సర్వాంతర్యామిభగవంతుని సేవించునతడు ఏవారికిని హింసచేయబోవడు. శ్రీగాంధీజీ 'అహింస' సర్వజీవులయెడలను, మనలను శత్రువులుగ భావించువారియెడలను సయితము ఆచరణయోగ్యమై యొప్పవలసియున్నది. స్వార్థ

ములు దీనికి హద్దులు పెట్టజాలవు. దీనివలన నరునిహృదయము పవిత్రమగును. పవిత్రహృదయములకు భగవంతుడు ప్రత్యక్షమగును అని తెలుపుచున్నాడు. కావున సత్యాహింసలను రెండుచక్రములపైని విద్యాప్రచారమును సాగించు విధానముగ వార్ధావిధానము బయలుదేరదీసినాడు. ఇందు పారమార్థిక, వ్యావహారిక జీవితముల రెంటికిని సఖ్యత కూర్పబడియున్నది. తీర్థము ప్రసాదము రెండునుకలిసివచ్చును. సత్యాన్వేషణమువలనముక్తి, అహింసాత్మకమగు సేవవలన భుక్తి లభింపగలవు. ఇందుగల ఆత్మబోధ శుష్కవేదాంతము గాదు. లౌకికజీవనమునకు వెలిజేయు సర్వవిసర్జనయోగము కాదు. వ్యాపారస్థానములందును, పరిశ్రమాలయములందును వినోదశాలలందును, సాంసారికగృహములందును, ఆచరణయోగ్యమైపరగు జీవితోపాయము. ఇయ్యది మన ప్రాచీన ఋషిసత్తములుబోధించినదియే. కాలగతిని శిథిలమై మరపున బడిపోయినది. ఇప్పుడు పునరుద్ధరింపబడి, దేశకాల పరిస్థితుల కనురూపముగా సవరింపబడి, నవీన వార్ధావిధానముగా అవతరించినది. కొంచెము భాషాభేదముతో అన్నిమతముల వారికిని హితవగు మార్గమే యిది. ఇయ్యది వార్ధాసభలో ప్రతిపాదింపబడుటచేత వార్ధావిధానమునుపేర వ్యవహరింపబడుచున్నది."

## విద్యాసభ-శ్రీగాంధీజీ ఉపన్యాసము.

"ప్రస్తుత విద్యావిధానము దేశమునకేమాత్రము ఉపయోగకరముగనుండుటలేదు. ఉన్నత తరగతులలో సకల

విషయములు ఇంగ్లీషుద్వారా బోధింపబడుచుండుటవలన స్వల్పసంఖ్యాకులైన విద్యార్థికులకును, బహుళసంఖ్యాకులైన జనసామాన్యమునకు మధ్య పెద్దఅఖాత మేర్పడిపోయినది. జనసామాన్యములో విద్యవ్యాపించుటకిది ప్రతిబంధకమయ్యెను. ఆంగ్లమునకీవిధమైన విశేషప్రాముఖ్య మీయబడుటవలన విద్యార్థికులు జీవితాచరణమునందు కుంటివారైపోయి, తమ దేశమునకు తామే దూరస్థులైరి. వృత్తివిద్యాశిక్షణమేమియు లేకపోవుటవలన ఫలదాయకమగు ఏకృషిని చేయలేక శారీరకముగాకూడ బలహీనులగుట తటస్థించినది.

ప్రాథమికవిద్యకై ప్రస్తుతము వ్యయపెట్టబడుచున్న సొమ్ము కేవలము వ్యర్థమని చెప్పక తప్పదు. నేర్పినదైనను ఇటు జనపదజీవనమునకుగాని, అటు నగరజీవనమునకు గాని పనికిరాదు. ప్రస్తుత విద్యావిధానమువలన నేదైన ఫలితముండిన అయ్యది ఎవరిచ్చుపన్నులవలన ప్రభుత్వకోశము ఎక్కువగ నిండుచున్నదో, అట్టివారి కెంతమాత్రము ముట్టుట లేదు. ఏలన, వారిసంతానము ఈవిద్యాప్రయోజనమే మాత్రము పొందుటలేదనియే చెప్పదగును.

ప్రాథమికవిద్యా సంస్కరణను ఈక్రిందివిధముగా చేయవలెనని నాకు తోచుచున్నది. ఈవిద్య ఏడుసంవత్సరములలో పూర్తియగునదిగ నుండవలెను. ఇంగ్లీషును మినహాయించిన మెట్రిక్యులేషను విజ్ఞాన మీఏడుసంవత్సరముల లోను బాలురకేర్పడునట్లుగ నుండవలెను. పైగా, జీవనమునకాధారము గల్పించు ఏదైన వృత్తివిద్యయందు విద్యార్థి సమర్థుడైయుండునట్లు చేయవలెను.

బాలబాలికల సర్వతోముఖాభివృద్ధికిగాను వారికిచ్చు శిక్షణమంతయు సాధ్యమైనంతవరకు ఏదైన లాభదాయక మగువృత్తి విద్యాబోధద్వారానే ఇవ్వవలెను. అనగా ఈ పద్ధతిద్వారా రెండుకార్యములు సాధింపబడవలసియున్నది. (౧) వృత్తివిద్యచే ఆయావస్తువులు తయారుచేసి తద్ద్వారా విద్యార్థి తన శిక్షణకగుఖర్చును తానే భరించుకొనగల్గుట. (౨) ఆ వృత్తివిద్యద్వారానే విద్యార్థి శారీరక, మానసిక, ఆధ్యాత్మికోన్నతిని పొందగల్గుట. విద్యార్థులు తయారుచేసిన వస్తువుల అమ్మకముద్వారా పాఠశాలకు గావలసిన నివేశన స్థలము, భవనము, సామగ్రి—ఇవన్నియుగూడ సంపాదింప బడవలెనని కాదు నాయభిప్రాయము. ఆఖర్చులిందులో చేరవు.

ప్రత్తి, ఉన్ని పట్టుపరిశ్రమలు (వడుకుపని, నేతపని, కలంకారిపని మొదలగునవన్నియు యిందులో చేరును). కుట్టు పని, బైండింగుపని, ఆటవస్తువులు తయారుచేయుపని బెల్లపు పంటపని ఇవన్నియు సులభముగా నేర్చుకొనదగినవి. ఎక్కువ పెట్టుబడి అవసరములేకయే సాగింపదగినవి.

కేవలము వృత్తులు నేర్చుకొనుటేకాదు. వృత్తులు నేర్చుకొనుటద్వారా విజ్ఞానమును బడయుట. ఇదినా ఆశ యము. సమస్తమైన విజ్ఞానము, సారస్వతము, దేశచరిత్ర, భూగోళము, గణితశాస్త్రము, భౌతికశాస్త్రము మొదలగున వన్నియు వృత్తివిద్యలద్వారానే నేర్పబడవలయును.

* * * *

“మనలో సాంఘికకలహములుకలవు. ఇవి కేవలము మన మొగమున నేవ్రాసిపెట్టినవికావు. వెనుక ఇంగ్లండులో

కూడ అంతఃకలహములు చెలరేగెను. ఇప్పుడు సామ్రాజ్య తత్వలోకమునకు శత్రువై కూర్చున్నది. మనము సాంఘికకలహములనురూపుమాపవలెనన్న నేను చెప్పినవిద్యా పద్ధతిద్వారా మనపిల్లలకు బోధచేయించి, రాబోయేతరము నకు మంచి పునాదివేయవలసియున్నది. అహింసాత్మకమైన పద్ధతి యిది. ఆదాయమేమియులేక, ప్రభుత్వకోశములు పూర్తిగానిండియున్ననుగూడ ఈస్వయంపోషకవిద్యా పద్ధతియే అవలంబించతగినది. మన సభ్యతకు, మననాగరికతకు, మనజాతియొక్క నిజమైనధర్మము మనబాలురను ప్రతినిధులనుగా నొనర్పవలసియున్నది. యూరపు మనకు ఆదర్శము కాదు. దానిపద్ధతులన్నియు హింసాత్మకములు. రష్యా పెక్కు ఘనకార్యములు సాధించినమాట వాస్తవమేకాని, దానివిధానమంతయు హింస, దౌర్జన్యముమీదనే ఆధారపడి యున్నది. మనభారతదేశము హింసను వర్జింపవలసియున్న యెడల నేనుచెప్పిన విద్యాపద్ధతియొక్క నియమము అనుష్ఠింపబడవలెను. విద్యకొరకు ఇంగ్లండు కోట్లు ఖర్చుపెట్టుచున్నదని, అమెరికాకూడ అట్లేవ్యయపరచుచున్నదని చెప్పుదురు. కాని ఆధనమంతయు ఒకరినికొట్టి సంపాదించినదని మరువగూడదు. పరపీడనమునకు వారొకశాస్త్రమును తయారు చేసిరి. ఆకారణమున వారి బాలురవిద్యకు వారు కోట్లకొలది ఖర్చుపెట్టగల్గుచున్నారు. పరపీడనపద్ధతి మనకు గ్రాహ్యము కాదు. కావున అహింసాత్మకమైన ఈస్వయంపోషకవిద్యా పద్ధతితప్ప మనకు స్వీకరింపతగినది మరియొకటిలేదు."

౭. వార్ధావిధానము—తదాశయములు

స్వయముగా వార్ధావిద్య సభయందు మహాత్ముడు తాను సూచించిన విద్యావిధాన ప్రధానాశయములను స్పష్ట పరచినాడు. ప్రప్రథమమున నీవిద్యావిధానము సత్యాహింసలపై నాధారపడియున్నది. "పరపీడనపద్ధతి మనకు గ్రాహ్యము కాదు. కావున అహింసాత్మకమైన ఈస్వయం పోషకవిద్యాపద్ధతితప్ప మనకు స్వీకరింపతగినది మఱియొకటి లేదు" అని యుపన్యసించుటలోనే మహాత్ముని యభిప్రాయము విశదమగుచున్నది. కోట్లకొలది డబ్బు ఖర్చుపెట్టవలసిన అవసరముగల విద్యావిధానము ననుసరించినచో, నిస్సహాయ స్థితియందున్న మనకెట్లు సాధ్యముకాగలదు? ఈ విధానము వలన సాంఘిక కలహములను దొలగించుటకుకూడ వీలు కలిగింపబడినది. అన్ని మతములవారు స్నేహభావమున మెలగుటకు, గురుశిష్యులకు పరస్పర గౌరవ విశ్వాసభావములు కుదురుటకు మార్గముగలదు. మహాత్ముని దూరదృష్టి వర్ణనాతీతము. ఈ విధానముద్వారా భావిభారత యువకులలో భేద భావములు కలుగకుండ, సాంఘిక వైషమ్యములందే తగుల్కొని దేశదాస్య విముక్తికి బ్రయత్నింపకుండ నసమర్థతను గన్పరపకుండుటకు మంచి పునాది వేయదలచినాడు. అన్నిటి కన్న ముఖ్యముగా జీర్ణదశలోనున్న వృత్తివిద్యలను బునరుద్ధరింప బోధించినాడు. ఈ విధానములో నేయే వృత్తివిద్యలు బోధింపబడునో, వాటిలోన నొకటైనను నేడు మన దేశములో సక్రమముగా సాగింపబడుచున్నవా? ఇప్పటి విద్యార్థికు లెంద

టికి వృత్తివిద్యాపరిజ్ఞానము గలదు ? దేశచరిత్రయన నేది ? స్వదేశచరిత్రియా ? లేక విదేశచరిత్రియా ? హైస్కూలు తరగతులలో భారతదేశచరిత్ర సక్రమముగా బోధింపబడుట లేదు. ఇక కళాశాలలో హిందూదేశచరిత్ర, ఇంగ్లాండు దేశ చరిత్ర—యీ రెండింటిలో నేది చదువదలచిన దానిని తీసి కొనవచ్చును. కొందఱు బుద్ధిమంతులు రెండవదానినే చదువ నిశ్చయించుచున్నారు. తప్పని సరిగా మన దేశచరిత్రను బోధించునదెప్పుడు ? ప్రస్తుత మమలునందున్న విద్యావిధా నమునం దెంతమాత్రము వృత్తిపరిశ్రమలకు చోటులేదు. అది నేర్చుకొనినవారికి విదేశ నాగరికతావిజ్ఞానము లబ్బునేగాని స్వదేశ రాజ్యాంగపరిజ్ఞానము, స్వదేశాభిమానములు పట్టు పడవు. భారతీయులకు యూరపుచరిత్రలను—హిందూదేశ చరితాంశముల నెఱుంగనప్పుడు—చదువుట నిర్బంధవిధాన మొనర్చిన గలుగు లాభ మేమి ? వృత్తివిద్యాబోధనము కానిఏవిద్యయు స్వయంపోషకము కాజాలదు. కనుకనే నేడు మనదేశమునందు నిరుద్యోగులు లెక్కలేనంతమంది గలరు. ప్రతివిద్యావంతునికి ఉద్యోగ మొనర్పవలెననే ఆదర్శకము గలదు. గాని, దేశపరిశ్రమల నేదైన నొకదానిద్వారా జీవన మును సంపాయించుకొనే తలంపు కలుగదు. తగిన ఉద్యోగ ములుదొఱుకనప్పుడు ముఖ్యముగా తెలివితేటలను బట్టిగాక సిఫార్సులు, మతవివక్షతలు మూలమున దొఱికిన సందర్భము లందు సైతము విద్యార్థులు నిరుద్యోగులుగా నుండెదరేగాని మఱోమార్గము నన్వేషింపక–నాగరికతకు హాని వాటిల్లునని–నిరర్థకముగా జీవితములను గడుపుచున్నారు. ఉద్యోగములందు

సైతము పక్షపాతమే ప్రధానాశయమగుచుండుట విచార కరము. మేధావియగువాడు సహజముగ దుర్బలుడైనంతనే ఉద్యోగానర్హుడగుచున్నాడు. వానికన్న వేయిమడంగులు తెలివిహీనుడైనను దేహధార్ఢ్యమున్నందున మఱొకడు గొప్ప ఉద్యోగమున కర్హుడుగా తలంపబడుచున్నాడు. ఇది చాల అన్యాయము.

మహాత్ముడు సూచించిన విద్యావిధానమునం దీలాటి యన్యాయములు జఱుగుట కవకాశములేదు. విద్యావంతు లందఱు ఇతరుల దయాదాక్షిణ్యములమీద నాధారపడ కుండ, ఆత్మగౌరవము కలిగి వృత్తివిద్యలద్వారా, సర్వతో ముఖ విజ్ఞానము నార్జించి జీవితోపాధిని సంపాదించుకొనుటకు సదుపాయములు గలిగియుందురు. కాంగ్రెసునుండి విరమించిన తరువాత మహాత్ముడు పూనుకొనిన గ్రామ పునర్నిర్మాణోద్యమ ఫలితమే వార్ధా విద్యావిధానమని ముమ్మాటికి చెప్పక తప్పదు.

మహాత్ముడు వార్ధా విద్యసభలో తెలిపినట్లు నేడు "స్వల్పసంఖ్యాకులైన విద్యాధికులకును, బహుళ సంఖ్యాకు లైన జనసామాన్యమునకును మధ్య పెద్ద అఖాతమేర్పడి నది." ఇందెంతయో యదార్థము గలదు. విద్యాధికునికి ప్రస్తుత విద్యావిధానమువలన లభించిన నాగరికతాదోషము వలన సర్వమానవ సమానభావ మంతరించినది. విపరీత మనో పరిణామము కలిగి, జనసామాన్యమును–వారికి విద్య రానంత మాత్రముననే–సరకుగొనక ప్రవర్తించును. విద్యాధిక్యతవలన

న్క్రమ వర్తనము, వివేకము గలుగును. నేడట్లు కాకుండ తద్విరుద్ధముగ పరిణమించినది. పైగా అహంకార ముద యించినది. జనసామాన్యముతో తన కేమి యవసరముగాని, సంబంధముగాని లేదను వెఱ్ఱిభావము కలిగినది. ఇక వారితో కలసిమెలసి తిరుగుట ఎట్లు? తిరుగుటయే నామోషియను కొనిన వారికి సమయమువచ్చినప్పుడు సేవ సల్పుట యెట్లు? వారికి విద్యాజ్ఞానములను కలిగించుట కెట్లువీలగును. కనుక నే క్రమక్రమముగా విద్యావంతులకు, జనసామాన్యమునకు భేద మేర్పడినది.

దీన నేటి విద్యావిధానమునకు, మహాత్ముడు సూచించిన విద్యావిధానమున కెంత తారతమ్యమున్నది. దేని నాచరించిన నుపయోగకరముగా నుండునది పాఠకులకు విశదమగుచున్నది. వేఱుగా చెప్పనక్కరలేదని నా యభిప్రాయము. అన్నిమతములవారీవిధానము ననుకరించుటకు వీలుగలదు. ఇందులో ఏ మతమువారును స్వమత విద్వేషమును బురికొల్పు సంగతులు బోధింపబడునని యూహాపడ నక్కరలేదు. ఇది అందరికి ఆచరణయోగ్యమే. ఈ విద్యావిధానమును ప్రస్తుత పరిస్థితులం దెంతవఱకు దేశమునందమలులో పెట్టవచ్చునో విచారించి తెలుపుటకు నియమింపబడిన కమిటీకి అధ్యక్షుడుగా మహమ్మదీయ నాయకుడగు జకీరు హుస్సేనుగారు నియమింపబడుట సంతోషింపదగిన విషయము. ఈ కమిటీవారు యావద్భారత దేశమునందు సంచారమొనర్చి, ఉపయోగకరములగు సలహాల నెన్నో యొసగిరి. వాటి నాచరణద్వారా ప్రయత్నించి భారతీయు

లందఱు మహాత్ముని విద్యావిధాన ఫలితములను బడయుదురు గాక! అని ఆశించుచున్నాను.

ఈ విధానమును గుఱించి మఱింత విపులముగా నెఱుగగోరినవారు శ్రీ తత్వానందస్వామివారిచే విరచింపబడిన "వార్ధావిధానము" అను గ్రంథమును చదువగలరని నా సలహా!

3. ప్రస్తుత విద్యావిధానము—శ్రీ వివేకానందుని విమర్శ.

౧౮౯౦ సంవత్సరమున, అమెరికాలో జఱిగిన అఖిల ప్రపంచ మత మహాసభలో, భారతదేశ ప్రాచీన గౌరవ సంపదలు కళ్ళకు గట్టునట్లుగా వేదాంత మతోపన్యాసముల నొసగి, తాను సంకల్పించిన మహాకార్యమునందు దిగ్విజయము నొంది, స్వదేశమునకు దిరిగి విచ్చేసి, భారతీయులను గుఱించి యొసగిన సందేశమునందు శ్రీ వివేకానందస్వాములవారు ప్రస్తుత విద్యావిధానమునందలి లోపముల నెట్లు బోధపఱచిరో యిట నుదాహరించుట సమంజసమని తలతును:—

"ఇప్పుడు మీరు నేర్చుచున్న విద్యయందు కొలది మంచి లక్షణములున్నవి. కాని అందు మహానర్థములుకలవు. అవి దానివలన వచ్చు మేళ్ళను త్రొక్కివేయగలంత గొప్పవిగ నున్నవి. మొదటగా ఇది పురుషత్వమును నిర్మాణము చేయు విద్యగాదు. ఇది పూర్తిగా నిషేధరూపమగు విద్యగా మాత్రమే యున్నది. నిషేధరూప విద్య, లేక దోషనిరూపణము చేయు ఏ శిక్షణమైనను మరణముకంటె నికృష్టమైనదిగ నుండును. బిడ్డను బడికి తీసికొని పోబడును. అక్కడ అతడు నేర్చుకొను మొదటి విషయము తండ్రి బుద్ధిహీనుడని! రెండవ

విషయము తన తాత వెఱ్ఱివాడని ! మూడవ విషయము తన గురువులందఱు మోసగాండ్రని ! నాల్గవ విషయము తన పవిత్ర గ్రంథములన్నియు అబద్ధములని ! ఇంతియే. ఆ బిడ్డలకు పదునారేండ్లు యీడువచ్చునప్పటికి అతడు ఎముకలు లేని, ప్రాణలేని, పెద్ద నిషేధముల కుప్పగా తయారగుచున్నాడు. తత్ఫలితాగ్రమున, ఇట్టి విద్య ఏబది సంవత్సరముల నుండి నేర్పబడుచున్నను, ఈ మూడు రాజధానులయందును ఒక్క స్వకల్పనాశక్తిగల పురుషుడు ఎక్కడనైన చూపట్టె నేని, అట్టి ప్రతివాడును ఇతర దేశములందు విద్య నేర్చి వచ్చిన వాడేగాని, ఈ దేశమునందు తయారైనవాడు కాడు. మనకు కావలసినది చైతన్యప్రదమై, పురుషనిర్మాణ కౌశలము కలిగి, శీలనిర్మాణ సమర్థములగు భావములను జీర్ణము చేసికొనగల ప్రబోధమే. కావున మన దేశముయొక్క పారమార్థిక వ్యావహారిక విద్య యావత్తును మన చేతులలో పెట్టుకొని, జాతీయపద్ధతుల ననుసరించి, జాతీయములగు సదుపాయములను సాధ్యమైనంతవఱకు నడుపవలసియున్నది. ఇది చాల పెద్ద ప్రణాళికయు, చాల పెద్ద ఉద్యమమనుటకు సందియము లేదు. ఇది ఎన్నడయినను ఆచరణలోనికి వచ్చునో రాదో నాకు తెలియదు. కాని మనము పనిని ప్రారంభించి తీరవలెను."

సందేశ తరంగిణి శ్రీ తత్వానందస్వామివారి అనువాదము.

ప్రస్తుత విద్యావిధాన మెంత పేలవముగా, జాతీయతాదర్శములకు విరుద్ధముగా నున్నదో పై వాక్యములలో గ్రహింపవీలగుచున్నది. జాతీయపద్ధతుల ననుసరించి, జాతీయములగు సదుపాయములను సాధ్యమైనంతవఱకు పారమార్థిక

వ్యావహారిక విజ్ఞానముతో నడువవలసియున్న దను శ్రీస్వాముల వారియుపదేశ సారాంశము నే మహాత్ముఁడు నేడు నూతనవిద్యా విధానము ద్వారా ఆచరణలో పెట్టుటకు వీలగు మార్గమును సూచించినాఁడు. ఈ విధానమునందు పారమార్థిక విజ్ఞానము సత్యాహింసలుగాను; జాతీయపద్ధతులు, జాతీయ సదుపాయములు వృత్తివిద్యలుగాను రూపింపఁబడినవి. కనుక మన మీ విధానము నమలునందుంచినచో దేశ లాభక్షేమములను వాంఛించు ఇద్దరు మహాపురుషుల— శ్రీస్వాములవారి, మహాత్ముని— మహదాశయములను నెఱవేర్చినవార మగుదుము.

## ౪. వార్ధావిధాన సిద్ధాంతము.

ఐతే యీ విధాన సిద్ధాంతమేమి? ఇది నేటి విద్యాధిక పుంగవుల కేల నచ్చలేదు? మహాత్ముఁడు తన యుపన్యాసమునందు సెలవిచ్చినట్లు సత్యాహింసలమీఁద నిది యాధారపడియున్నది. వాటియందు ధృఢనమ్మకము గల వారికే యీ విధానముయొక్క గొప్ప ధనము గ్రాహ్యమగును. వృత్తివిద్యలు వీరికి తమ విద్యార్జనసమయమునందు బోధింపబడనందునను, తదుపరి తమ నిత్యజీవితములో వాటి నెఱుంగ బ్రయత్నింపనందునను, చులకనగా కన్పట్టును. ధనవంతులకు, ఉద్యోగములు లభించిన విద్యావంతులకీ వృత్తి పరిశ్రమావసరముతో పనిలేకపోవచ్చును. కాని మన దేశములో అందఱు ధనవంతులు, విద్యావంతులు కారే! అన్నాతురు లెందఱో, వ్యక్తిత్వమును గోల్పోయిన నిర్భాగ్యులెందఱో, వృత్తులు మూలబడి నిస్సహాయస్థితియందు

కుములుచున్న గ్రామస్థులెందఱో యీ విధానఫలితముల ననుభవించుటకు వీలు గలదు. అందఱొకచోట కలసిమెలసి, అహింసాత్మగమగు ఈవిధానము నాచరణయందుంచిన పరస్పరైకమత్యముకలిగి వర్తింపగలుగుదురు. త్వరితముగ నాచరణయందుంచిన, దీనివలన భావియువకులు పారమార్థిక వ్యావహారికాభివృద్ధిని గాంచి, స్వయంపోషకులై, దేశసేవాతత్పరులై, జాతిగౌరవ భూషణులై, సుఖప్రదనుగు జీవితమును నడుపగలరనుట కావంతయు సందియములేదు. ఆనాడు తిరిగి భారతదేశమునకు ప్రాచీన గౌరవ సంపదలు ప్రాప్తించగలవు.



# అయిదవ ప్రకరణము

## మహాత్ముని విజ్ఞానము



ప్రాచ్య సనాతన మతవిశిష్టతను, ఆధునిక పాశ్చాత్య విజ్ఞానసంపదను, అసాధారణబుద్ధి కౌశల్యమును ఆమూలాగ్రముగా గ్రహించినాడు మహాత్ముడు. రెండింటిని సమన్వయ పరచి, దేశదాస్యభారవిముక్తికార్యమున నద్వితీయమగు మార్గము నాచరణలో బెట్టినాడు. ప్రాచ్యపాశ్చాత్యవిజ్ఞాన నైపుణ్యమును గడించుటలో మహాత్ముడే ఆదర్శపురుషుడు. ఆయనకుగల సనాతనమత విశ్వాసము, పాశ్చాత్యవిజ్ఞాన గ్రహణశక్తి, రాజకీయపరిస్థితి పర్యాలోకనము అద్వితీయము. భారతీయులలో ఆయనకాయనయేసాటి. ఆత్మైక్య సంధానతత్పరత, సమభావము, సత్యాహింసావ్రతానుష్ఠానము అవ్యాజానురాగము, క్షమ, ఓర్పు, అసాధారణ మేధాసంపత్తి మహాత్మునికి దివ్యాలంకారములు. ఆయన నవతార పురుషుఁడని చెప్పుట కెట్టి ఆక్షేపణలేదు.

ఐనను సంఘమందు తమ మర్యాదలకు భంగము వాటిల్లగలదని వెఱచి, స్వార్థపరులై, సవర్ణహిందువులు కొందఱు హరిజనోద్ధరణోద్యమమును విమర్శించి, మహాత్ముడు కల్క్యవతారమని దూషించిరి. ఇట్లనుటలో వారి అమాయకత్వమేకాని, దోషము నిరూపింపబడదు. దశావతారము

లలో కల్క్యవతారము కడపటిది. తెలియకుండానే మహాత్ముడవతారపురుషుడని చాటినారు. దాన మహాత్ముని గౌరవము ద్విగుణీకృత మొనర్పబడినదేగాని కొఱతవడలేదు. ఇట్లగునని వారికి తెలిసియుంటే అనకపోయేవారేనేమో! ఎట్లైతేనేమి, ఇష్టములేకుండానే మహాత్ముని గౌరవించినారు. ఈదూషణ,భూషణలు మహాత్మునికి సమానమేకాని,విచారానంద కారణములు కాజాలవు. కారణ మాయన సమభావము గల పండితుఁడుకాని బండితుండు కాడుగా!

నిజముగా మహాత్ముడవతారపురుషుడు. భారతీయులంద ఱాయనను దశావతారములతోబాటు నిత్యము పూజింపవలెను. ఆయన నెఱుంగకపోవుట, భగవంతునియెడ నపచార మొనర్చుటయే. ఆహా! విషమపరిస్థితులందు దేశరక్షణ మొనర్చుటకు, మానవ కళ్యాణమును సమకూర్చుటకు, భగవంతుడు భారతమాత కడుపుననే అవతరించునుగదా! ఎంత పుణ్యము. నిశ్చయముగా ప్రపంచజాతు లన్నిటిలో భారత జాతియే గొప్పది. గర్వింపదగినది.

మహాత్ముడు మనకు విముక్తి కలుగునంతవఱకు అవతారమును చాలింపకుండుగాక! ఆ మహాత్ముని కృపాకటాక్షముననే భారతభూమి తిరిగి సస్యశ్యామలమై వర్ధిల్లుగాక!! భారతపుత్రులు సఫలీకృత మనోరథులై పెంపొందెదరుగాక!!!

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

---

# అనుబంధము

## విఖ్యాత పురుషుల అభిప్రాయములు.

మహాత్ముని గుఱించి విశ్వవిఖ్యాత పురుషుల యభిప్రాయము లెట్లున్నవో పాఠకుల కెఱిగించి గ్రంథమును ముగింతును.

### + డాక్టరు జాన్ హేనెస్ హోమ్సు.

---

+ "He (Mahatma Gandhi) holds to-day the centre of the World's attention. That position of primacy held so proudly by Woodrow Wilson in 1918 and 1919, and by Nicolas Lenin in 1920 and 1921, is now occupied by a little Oriented who has never held any official position, who seeks neither glory nor power......................If I would classify him (Mahatma Gandhi) with any of the supreme figures of human history, it must be with such august religious prophets as Confucious and Laotse, Buddha, Zeoroaster and Mohammad, and most truly of all, the Nazarene! Out of Asia, at long intervals of time, have arisen these inspired witnesses of God. One by one they have appeared to teach men by precept and example the law of life and here-wish to save the race. To-day in this our time, there comes another of this sacred line, the Mahatma of India. In all reverence and with due regard for historic fact, I match this man with Jesus Christ! If the lives of these two were written side by side, as Plutarch wrote the lives of the great heroes of Greece and Rome, it would be amazing to see to what extent they are identical.

"......................To find anything to match this influence of Gandhi over his people, we would have to return to ancient times and remote places, and even the parallel would be incomplete.

"నేడు మహాత్ముడు ప్రపంచదృష్టి నాకర్షించు చున్నాడు. ౧౯౧౮-౧౯౧౯ సంవత్సరములలో ఉడ్రోవిల్సను; ౧౯౨౦-౨౧ సంవత్సరములలోని కలస్ లెనిన్ గర్వింపదగిన నేమహాపద విని అనుభవించిరో, అట్టి మహోన్నతస్థితిని ఇప్పుడు గొప్ప యుద్యోగములకుగాని, కీర్తికి అధికారమునకు గాని, ఆశపడని ప్రాచ్య దేశీయు డొక డనుభవించు చున్నాడు............

........."మానవ చరిత్రలోని మహావ్యక్తులతో బోల్చదలచితేని, తప్పకుండ కన్ఫ్యూకస్, బోట్సే, బుద్ధుడు, జొరాస్టరు, మహమ్మదు, అందరికన్న ముఖ్యముగా, నాజరీను తోను పోల్చెదను. ఆసియాఖండములో, అప్పుడప్పుడీలాటి మతప్రవర్తకులు జన్మించియుండిరి. ప్రతి ప్రవక్తయును ఆచరణపూర్వకముగా జీవిత పరమావధిని స్పష్టపఱచి, తద్వారా జాతిని సంరక్షించెను. ఇట్టి తరగతికి సంబంధించిన మన సమకాలికుడు మహాత్ముడు. గౌరవ పురస్సరముగ చరిత్రాంశములను మన్నించుతూ, ఈమానవుని (మహాత్ముని) ఏసుక్రీస్తు డంతటివాడ నెదను. గ్రీకు, రోము మహావీరుల

---

"........................This Indian is a saint in his personal life; he teaches the law of life, and non-resistance as its practice; and he seeks the establishment of a new social order which shall be a kingdom of the spirit. If I believed in "the second coming", as I do not, I should dare to assert that Gandhi was Jesus come back to earth. But if the "second coming" has no historical validity, it has at least political significance; and in this sense can we not speak of Gandhi as indeed Christ?..........."

జీవితములను ప్లూటార్కు వ్రాసినట్లుగా, వీరిరువురి (మహాత్ముడు, క్రీస్తు) జీవితములను పోల్చి వ్రాసినచో వీరిలో నెంతవఱకు సమాన లక్షణములు గోచరించునో తెలిసికొనుట కాశ్చర్యముగా నుండును.

"స్వదేశీయులపై గాంధి కెంత పలుకుబడిగలదో తెలిసికొనుటకు, మనము పూర్వకాలమునందు జఱిగిన వాస్తవములను జ్ఞప్తికి తెచ్చుకొనవలసియుండును. ఐనను నాటి విశేషములకు, నేడు గాంధికిగల పలుకుబడి విశేషమునకు, సామ్యము అసంతృప్తిగా నుండును.

"నిత్య జీవితమునందీ ప్రాచ్యుడు సర్వసంగ పరిత్యాగియై, జీవిత పరమావధిని—దాని నాచరణలో పెట్టుట కహింసను బోధించుచు; ఆత్మశక్తిరూపకమగు నూతన విధానమును స్థాపింప బ్రయత్నించుచున్నాడు. నాకు నమ్మకము లేదు, కాని పునర్జన్మయందు విశ్వాసము కలిగిన పక్షమున ఏసుక్రీస్తు, మహాత్ముని యాకారముతో ప్రపంచమున కేతెంచెనని చెప్ప సాహసింతును. కాని పునర్జన్మయందు నమ్మకము చరిత్రాంశాత్మకముగ కలుగనిచో రాజకీయ పరిస్థితులను విచారించునప్పుడయిన దానికి విలువ గలదు. ఈ అర్థముప్రకారము గాంధియే నిశ్చయముగా ఏసుక్రీస్తు అని చెప్పుట మనకు సంభవము కాదా? ......"

‡ పి. జి. బ్రిడ్జి మహాశయుడు.

‡ "The idea of Mahatma Gandhi would ever remain in the History of India, nay in the whole History of the World..............Absolute truth and fearlessness were the guiding principles of his life.

"మహాత్ముని వృత్తాంతము హిందూదేశ చరిత్రలోనే గాక, తప్పకుండ ప్రపంచ చరిత్రలో చిరకాలము నిలిచి యుండును.........సత్యము, అకుంఠిత ధైర్యము ఆయన జీవితమునకు ముఖ్యమైన ఆధారము. సత్యమునం దాయనకుగల యభిప్రాయము దేశాభిమానమునకన్న గొప్పది.........మహాత్ముడే నేడు నిజమైన భావిభారత భాగ్యవిధాత."

* ఎఫ్. జి. జేమ్సు మహాశయుడు:-

"కష్టముల నోర్చుకొనుట, ప్రేమించుట-ఈ రెండింటిని పూర్వము క్రీస్తు; నేడు క్రీస్తుగా పరిగణింపబడిన మహాత్ముడు కనిపెట్టిరి.

---

His loyalty to truth was even greater than in loyalty to the country. .....................It is Mahatmaji who is really spinning out the destiny of the whole Nation."

* "To suffer from—to give love to—these are the discoveries in their time of the Christ of the ancient and the *Christ of the modern world* (Mahatma Gandhi)."

"Gandhi to-day recognizes this dynamic of love, as did Jesus. He is making use of the same principles, but on a greater scale and to a greater end. He prophesies the "Kingdom of God on Earth."

"That he is the Christ of modern times cannot be disputed. The question that presents itself is not the acceptance of this already widely recognised fact. The question before mankind to-day is are we to recognise him now that he (Christ) has come again."

"క్రీస్తువలెనే గాంధి ప్రేమతత్వమును గుర్తెఱిగినాడు. మునుపటి ఉత్తమాశయముల నవలంబించుచున్నను వాటిని విశాలదృష్టితో, విపులముగా ఆచరణయందుంచి "రామ రాజ్యము"ను ప్రపంచమునందు నెలకొల్ప బ్రయత్నించు చున్నాడు.

"ఆయన వర్తమానయుగమునకు క్రీస్తు అనునది నిర్వి వాదాంశము. ప్రపంచ మెఱిగిన యీ యధార్థ వార్తను గురించి చర్చించుటగాక, ఆ క్రీస్తు నేడు మహాత్ముని ఆకృతి తో పునరుద్భవించినాడా? అని యెఱుగవలసిన విషయమే ఆలోచించవలసియున్నది."

* పెరల్ బక్ సతి.

"ఆయన జీవితకాలమునందే మహాత్ముని పేరొక వ్యక్తి పరముగా గాక, ప్రస్తుత విషమ ప్రపంచమునందు జీవితమును గడుపు విధానముద్వారా ప్రఖ్యాతమైనది......గాంధీగారు తానంగీకరించిన జీవితవిధానమునందు పట్టుదలతో నడచుట వలన కోట్లకొలది యితర మానవులకు వలెనే నాకు ప్రపం చమునందుగల నిరంకుశత్వమును, అకుంఠిత ధైర్యసాహసము

---

* "The name of Gandhi even his life time has passed beyond the meaning of an individual to the meaning of a way of living in our troubled modern world....................Mr. Gandhi's steady peristence in his chosen way has given me among millions of others, courage to resist, by the greatest of all resistances, unconquerable, unwavering personal determination, the growth of tyranny in the world."

లతో, అచంచలమగు విశ్వాసముతో, ఎదుర్కొనుటకు శక్తి ప్రాప్తించినది."

+ సర్. యస్. రాధాకృష్ణయ్యగారు.

చరిత్ర ప్రసిద్ధములగు పోరాటములవలన గాక, ప్రపంచ వినాశమును సూచించు పశుబల ప్రాబల్యము హెచ్చిన సమయమునందు ఆత్మశక్తిని, ఆత్మవిశ్వాసమును నిరూపించుటవలననే మహాత్ముని గొప్పదనము రూఢిపఱుపబడినది. ప్రజలందఱు తిరిగి ఆయన "రామరాజ్యము"ను స్థాపించునని తలచుచున్నారు."

సంపూర్ణము.

---

+ "The greatness of Gandhi is more in his holy living than in his heroic struggles, in his insistance on the creative power of the soul and its life-living quantities at a time when the destructive forces seem to be in the ascendant"..................They (the people) seem to think that he is likely to restore the golden age.

# ప్రశంస



మదారిసునుండి శ్రీ. తాపీధర్మారావుగారి సంపాదకత్వమున వెలువడు 'కాగడా' అను పత్రిక యిట్లభిప్రాయమిచ్చుచున్నది:—

"దేశభక్తితో నిండి, విజ్ఞానాన్ని వెదజల్లుచూ ఉన్న ఈ ప్రచురణములు (౬ వ ప్రచురణము వరకు) మా కార్యాలయముచేర, మాకానందాన్ని సమకూర్చాయి. అయితే, ఆరణాలకన్న ఎక్కువకాని స్వల్పవెలలకు, ఇంత చక్కని గ్రంథాలను ఇవ్వడం ప్రశంసాపాత్రం. ప్రజలకు—వినోదం కలిగించడంవల్ల గ్రంథమాలను అభివృద్ధి చేసుకోనేదృష్టి ప్రకాశకులకులేదు. "ప్రజలకు ఈ దినాలలో అత్యావశ్యకమయిన విజ్ఞానం కలిగించాలి" అన్న దృఢసంకల్పం ప్రతి ప్రచురణమునందు ప్రస్ఫుటంగా కనబడుతూ ఉంది. హైందవ ధర్మవీరులు, ప్రాథమిక సత్వములు, ప్రజలు-ప్రభుత్వము, ఆంధ్ర సంస్థానము, కమాల్ పాషాజీవితము మొదలయిన పేరులే దీనికి నిదర్శనము. ఇలాంటి సంకల్ప ముండడ వల్లనే ఈ గ్రంథమాల ఆదరణయోగ్యం అవుతుంది ఆంధ్రులందరికి. దీనికితోడు శైలి సుబోధంగా ఉండి, ప్రతి అక్షరం లోనూ ఉత్సాహపూరితమయిన హృదయం కనబడుతూ ఉండడంవల్ల పుస్తకం తెరచింది మొదలు సంపూర్తి చేసినంతవరకు విడిచిపెట్టడానికి వీలుండదు. మల్లంపల్లి సోమశేఖరశర్మ, డాక్టరు పట్టాభి సీతారామయ్య మొదలయిన ప్రముఖుల ఉపోద్ఘాతాలతోనూ, సురవరము ప్రతాపరెడ్డిగారి వంటి ప్రజ్ఞావంతుల రచనలతోనూ అలరారుచున్న ఈ గ్రంథమాల త్వరలో ఆంధ్రులందరి ఆదరమును పొందుతుందనీ, ఇంకా ఇలాంటి గ్రంథరాజాలతో ఆంధ్రులకు విజ్ఞానదానం చేస్తూఉంటుందనీ నమ్ముతున్నాము. వలయువారు దేశోద్ధారక గ్రంథమాల, ఇమాంబాడవీధి; సికింద్రాబాదు అని వ్రాయాలి."

—'కాగడా' ౧౮ ఫిబ్రవరి ౧౯౪౦ బుధవారము

# సోదర గ్రంథమాలలు

అణా గ్రంథమాల; ३६४८१ తూరుపుబజారు, హైద్రాబాదు-దక్కన్.

రైతు: ప్రచురణములు ౨. వెల ఒక అణా (కల్దారు)

ఈ గ్రంథములో శ్రీ. వెల్దుర్తి మాణిక్యరావుగారు తేట తెలుగులో రైతునకు సంబంధించిన ప్రతిసమస్యను చర్చించి, పరిష్కరించినారు. రైతులెన్నివిధముల అధోగతి పాలగుచున్నారో, ముఖ్యముగా నిజాంరాష్ట్రపు భూమ్యాదాయశాఖ పద్ధతిచే రైతులెట్లు పీడింపబడుచున్నారో ఉదహరించినారు. పంజాబురాష్ట్రములోగల సమిష్టి వ్యవసాయపద్ధతిని విధిగా అవలంబనీయమని సిఫార్సు చేయుటయే గాక వానివలని లాభములనుకూడా పేర్కొనినారు. ముఖ్యముగా ఈగ్రంథములో రైతు అధోగతిపొందుటకు కారణము, అతడు బాగుపడుటకు మార్గము సూచింపబడినది. శ్రీగ్రంథకర్త గారు సూచించిన ప్రతివిషయము ప్రతిరైతు ఆచరించినచో "గ్రామస్వరాజ్యం" అనుభవించుటలో సందేహము లేదు. కనుక శ్రీ గ్రంథకర్తగారనినటుల, "రైతు సోదరులారా! నిద్రించుటకిది సమయముకాదు......బద్ధకంకణులై కార్యదీక్షబూనుడు. విజయలక్ష్మి మిమ్ములతప్పక వరించగలదు. స్వాతంత్ర్యమాల మీకంఠము నలంకరించగలదు."

ఈ గ్రంథము సంతకముచేయుశక్తిమాత్రమే కలిగిన రైతుకూడా అర్థముచేసికొనగలడు. వ. ఆ.

# వెలువడనున్న గ్రంథములు.



సంస్థానప్రజల స్వాతంత్ర్య సమరము

దేశీయ సంస్థానములు-ఫెడరేషను

నిత్యజీవనమందు విజ్ఞానశాస్త్రము

గాంధివాదము-సామ్యవాదము

హైద్రాబాదు రాజకీయములు

(రెండుభాగములు)

హైద్రాబాదు విద్యావిధానము

భారతజాతీయోద్యమ చరిత్ర

బాధ్యతాయుత ప్రభుత్వము

రాయలనాటి రాజ్యాంగము

భారతదేశ రాజకీయములు

దేశీయ సంస్థానములచరిత్ర

సంస్థానముల భవిష్యత్తు

ప్రజాజీవనసమస్యలు

అహింసాప్రభావము

గ్రామజనదర్పణము

నేటిమనగ్రామాలు

ఆజాద్ సందేశము

రైతు-రాజు

పాకిస్తాన్

# వెలువడిన ప్రచురణములు

| | | |
|---|---|---|
| | ౧. హైందవ ధర్మవీరులు † | ౦-౬-౦ |
| * | ౨. ప్రాథమిక సత్వములు | ౦-౫-౦ |
| | ౩. కమాల్ పాషా జీవితము (౧ వ భాగము) | ౦-౬-౦ |
| | ౪. కమాల్ పాషాజీవితము (౨ వ భాగము) | ౦-౬-౦ |
| | ౫. ప్రజలు-ప్రభుత్వము | ౦-౬-౦ |
| | ౬. ఔంధు సంస్థానము | ౦-౫-౦ |
| | ౭. కాంగ్రెసు-సంస్థానములు | ౦-౬-౦ |
| | ౮. సంస్థాన సమస్యలు | ౦-౬-౦ |
| | ౯-౧౦. గాంధీమహాత్ముడు (రెండుభాగములు) | ౦-౧౨-౦ |

## అనుబంధ ప్రచురణములు.

| | | |
|---|---|---|
| * | ౧. రైతు-భూమి-ఋణము | ౦-౧౦-౦ |
| * | ౨. సంస్థాన ప్రజలసమస్యలు | ౦-౨-౦ |

* ప్రతులు లేవు.

† సభ్యులకు ప్రతి ప్రచురణము నాలుగు అణాలు.

ప్రీమియర్ [illegible]